OKA ANUBHAVAM NUNCHI

*Dr. Bhusurapalli Venkateswarlu*

First Edition

**November - 2003**

Cover Design

**Bhusurapalli**

Price : Rs. 50/-

For Copies

**1. Bhusurapalli Vijayalakshmi**

W/o Dr. Venkateswarlu

Telugu Lecturer

MACHERLA - 522 426

Ph : 08642 - 222644

**2. Visalandhra Book House**

Sultan Bazar-Hyderabad, Bank Street-Hyderabad,

Guntur, Vijayawada, Visakhapatnam, Kakinada,

Anantapur, Tirupathi, Hanumakonda

**3. Navodaya Publishers**

Kachiguda-Hyderabad, Eluru Road-Vijayawada & Guntur

Printed at

**Don Bosco Tech. School Press**

Ring Road, Guntur - 522 007

Ph : (0863) 2350832

గుండెల్లో యింత సంస్కారాన్ని చల్లి
గులాబీలు పండించిన వారు
ప్రేమాను రాగాల్లో భాగం పంచి ఇచ్చి
పుత్రుడుగా స్వీకరించిన వారు
నా కుటుంబానికింత సాహిత్య
పరిమళాన్ని అద్దిన వారు
ఈ తీగెకు అక్షరాలు పూసినప్పుడల్లా
చెట్టై చేయి అందించిన వారు
అన్నీ తామే అయి
నన్ను నన్ను చేసిన వారు
నా గురుదేవులు ...
**డాక్టర్ నాగభైరవ కోటేశ్వరరావు గారు**
వారి పాదాలకు
నమస్సు మనస్సులతో

# వెలసిన పూసల కోటు

కన్నీళ్ళు చల్లి కళల్ని మొలిపించే ఈ నేలలో
కల్లంలో కంకులూ లేవు
దోసిట్లో గింజలూ లేవు
రాత్రి రాజు వేషంలో మెరిసిన రవితేజమంతా
తెల్లవారగానే తెల్లబోతుంది
భాగోతం మధ్యలో పిట్టకథలా
పకీరు వేషం ప్రారంభమౌతుంది
రాత్రి హస్తినాపురాన్ని పరిపాలించిన అభిమానధనుడే
'అమ్మా ! ఇంత అన్నముంటే పెడతారా !'
అంటూ అంగలారుస్తుంటే
తలదించుకున్న తల్లినేల
తడిసిన కళ్ళలోంచి
రాలుతున్న కలలతో
కళల్ని అభిషేకించుకుంటుంది

చీకటిలోనూ చెరగని దీపాల్లా
మినుకుమంటున్న కొన ఊపిరి బతుకుల్లో
కళ తనకు తానే గొంగళి పురుగయింది
ఉనికి మార్చుకొని
పత్తిచేలో మందు కొట్టడానికో
పొగచేలో ఆకులల్లడానికో వలసపోయింది

'కళ' ఎంత గొప్ప శబ్దం
ఎంత విస్తృతం
ఆకలి కావడం నుంచి
అడుక్కోవడం వరకూ అన్నీ
అరవై నాలుగు కళల్లో భాగాలే !
అబద్ధాన్ని అద్దంగా మలచుకొని
వేసుకున్న రంగుల్లో అంతా వేదాంతమే !
సాధనకు రూపం కదా మరి !
వారి బతుకు దేవుడికే ఎరుక !
రంగు రంగుల్లో ఎన్ని కళ్ళు గుచ్చుకుంటాయి
ఎన్ని పెదాలు నవ్వుకుంటాయి
ఎన్ని ఆవేశాలు చప్పట్లు చరుచుకుంటాయి
ఎన్ని వేళ్ళు ఈలలై మిన్నుముడతాయి
ఇన్నిటి మధ్యా తన ముద్దనే వెతుక్కునే పెదాలు
అన్నిటిలోనూ తన ఆకలినే కొలుచుకునే కళ్ళు
తెల్లారితే పకీరు వేషం కట్టి
బజార్లో జోలె పడతాయి

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

రాత్రి రంగు విప్పాక
రాలిన రాళ్ళని ఏరుకుంటూ కీసుమన్న గొంతు
మళ్ళీ చీకటి పడేదాకా శృతిలో కలవడానికి
తపస్సు చేస్తూనే ఉంటుంది

అక్కడ
అవసరం హార్మోనీ పెట్టె అవుతుంది
ఆకలి హాస్యం చేస్తుంది
ఇంకిపోయిన కళ్ళలోంచి జారే గ్లిజరిన్ చార
రెప్పల రంగులో కలసి రక్తమై ప్రవహిస్తుంది
అతడు పొద్దుగూకాక
వీధి నాటకం వెయ్యవచ్చు
చెక్క భజన చెయ్యవచ్చు
భారతం చెప్పవచ్చు...
భామాకలాపం చెయ్యవచ్చు
కాళ్ళకు గజ్జె కట్టవచ్చు
కళ్ళలో వత్తులు వేసుకోనూవచ్చు
పొద్దుపొడిస్తే అతని బతుకు పగటివేషం
అతని ఉనికి గంగిరెద్దు
అతని బింకం పెద్దపులివేషం
అతని జీవితం సంతలో దరువు

రచనాకాలం : 01.03.02
వెలిది వెంకటేశ్వర్లు, యువచైతన్య విజ్ఞానవేదిక
రాష్ట్రస్థాయి కవితాపోటీల్లో ప్రథమ బహుమతి
పొందిన కవిత.

# బతుకు పెనం మీద

అరవై యేళ్ళుగా అవ్వ
పెరట్లో రుబ్బురోలై
గిరగిరా తిరుగుతూనే ఉంది
తోలు గూట్లో తళుకుమంటున్న గాజుకళ్ళు
పొద్దు పొడవగానే పొగచూరుతున్నాయి
ఏడవకుండానే కన్నీళ్ళు రాలుతున్నాయి
అవ్వ పెనం చుయ్ మంటేనే
ఆ వీధి పరగడుపుతో పుక్కిలిస్తుంది
అరక్షణంలో తిరగేసిన దోసె
అరగంట అంగలార్చిన చూపులకు రూపాన్నిస్తుంది
గంటలుగా రుబ్బిన పిండి గరిటల్లో కరిగి
బొడ్లోకి చాలని చిల్లపెంకులైతే
చిల్లరలో చిక్కుకున్న ప్రాణం
ఊరిన లాలాజలాన్నే గుటకేసి

ఊపిరి పోసుకుంటుంది
అనుక్షణం బతుకు పెనం మీద
అవ్వడొక్క ఒక పక్క మాడుతూనే ఉంటుంది
పొత్తరం మీద ముడతలు బడ్డ వేళ్ళు ఎప్పటిలాగే
పొగిలి పొగిలి ఏడుస్తూనే ఉంటాయి
మిగిలిన చిల్లర లాక్కుని
మిఠాయి కొనుక్కునే మనవణ్ణి చూసినపుడు
మాతృత్వం కళ్ళల్లో మినుకుమంటుంది
అంతలోనే కోడలు కొంగు కళ్ళకు చుట్టుకున్న
కొడుకుని తలచుకొని
తల్లిదనం తలవంచుకుంటుంది.
అయినా అవ్వ అరిగి పోతూనే ఉంది
కాలం కరిగి పోతూనే ఉంది
ఆమె చేతిలోని రుచి మరిగి ఒరిగి పోతూనే ఉంది
ఇవాళ నూనెకారుతున్న చీపురుకట్టముందు
అవ్వ చేతిలోని అట్లకాడ ఓడిపోయింది
ప్రపంచాన్ని చుట్టి
ఉన్నచోటికే చేరే ఉపగ్రహంలా
అవ్వచేతిలో పొత్తరం
ఊపిరాడకుండా గిరగిరా తిరుగుతూనే ఉంది

రచనా కాలం : 08.01.99
దూరదర్శన్ కవిసమ్మేళనం

# ఒక అనుభవం నుంచి

ఉన్నవన్నీ
కావాలనుకున్న వన్నీ
ఎదురైన వన్నీ
దాచుకున్న వన్నీ
ధ్వంసం చేసుకున్నాక
అనుభవాలు మాత్రమే మిగుల్చుకున్న వా
వాసనలన్నీ నాకునేనే
ఒక్కొక్కటీ తుంచుకున్నాక
కలల్నీ, కలతల్నీ
కాలం మైలురాళ్ళ దగ్గర
జార విడుచుకున్నాక
ప్రేమను మాత్రం మిగుల్చుకున్న వాణ్ణి
అనుభవం కరిగి
కళ్ళలోంచి జారితే

---

డాక్టర్ భూసురపల్లి వేంకటే

రాల్చుకోడానికి హృదయంలో
చోటు దాచుకున్నవాణ్ణి
అనుభూతిని ఆవిష్కరించలేని
నేర్చుకున్న కృతక భాషను వొదులుకున్నాక
అనుభవాన్నే మాటగా మార్చుకున్న వాణ్ణి
తంత్రిలా ప్రకంపించడం తెలిసినవాణ్ణి
పువ్వులా నవ్వడాన్నే కోరుకున్నవాణ్ణి
నవ్వునిండా అందాన్ని నింపుకున్న వాణ్ణి
నవ్విన అందం
సాయంత్రానికే రాలిపోతుందన్న
అనుభవ సత్యాన్ని స్పర్శించడానికి
నాకు నేను
ఏదీ వెంటరాని
ఒంటరితనంలో మిగిలి ఉన్న వాణ్ణి

రచనా కాలం : 04.09.02

# రేపటి యుద్ధం

విరిగిన శకలాల్లో ఎక్కడా బతుకు కనబడ్డం లేదు
ఆకాశం నుంచి దేవదూతలు విసిరేసిన పొట్లాల్లో
ఆహారం పాచిపోయి
అధికారం వాసన కొడుతుంది
ఇప్పుడు ప్రశ్న ఉగ్రవాదం గురించికాదు
పగిలిపోతున్న పర్వతాల గురించి కాదు
మళ్ళీ మళ్ళీ రగులుతున్న యుద్ధాల గురించి కాదు
అగ్రత్వం జూదం గురించి కాదు
అమానుషమైన ఆయుధ దాహం గురించికాదు
ఆకలి గురించి
ఆక్రందన హంసధ్వనిగురించి
తల్లి గురించి

---

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

తల్లి ఒడి గురించి
శవ వాసనలో చిగురించలేని పసరు మొగ్గలగురించి
లేత బుగ్గల మీద కరుడుగట్టిన నెత్తురు చారికల గురించి
దుమ్ము కొట్టుకున్న శిథిల జీవితాల గురించి
మరణాన్ని తప్పించుకున్న దురదృష్టవంతుల గురించి
భవిష్యత్ గీతలతో రెపరెపలాడుతున్న బంగారు రేకుల్ని
అల్లహో అక్బర్ అనడం మరచి
అన్నం పొట్లాల కోసం ఆకాశం వైపు చూస్తుంటే
వేల ఏళ్ళుగా తనను తాను దిద్దుకోనందుకు
ఖురాన్ కంటతడి పెట్టుకుంటుంది
ఏళ్ళుగా బురఖాల్లో కూరుకుపోయిన కళ్ళకు
రెప్ప తొలగిన చోటే రక్తం ప్రవహిస్తుంటే
అడుగడుగునా మందుపాతరలు దాచుకున్న అమ్మనేల
అగ్నిగోళమై పగిలిపోతుంది

ఓ ఉన్మాదులారా !
వాళ్ళకు మీ కంటితుడుపు మాటలు వినబడ్డంలేదు
కళ్ళముందు యుద్ధమే కనిపిస్తుంది
చంపిబుజ్జగించే
మీ రంకుల రాజకీయాలు కనబడ్డం లేదు
కళ్ళలో నిప్పులే కురుస్తున్నాయి
పిడికిలి బిగుసుకున్న లేత చేతుల్లో
రాతలు కాదు తుపాకులు మొలుచుకొస్తున్నాయి

అధికారం కోసమో, అహంకారం కోసమో కాదు
రక్షించుకున్న ప్రాణాన్ని దక్కించుకోడానికి
కళ్ళు నెత్తిన మొలిచిన వాడల్లా కాటువేయని
వాళ్ళదైన ఒకానొక నేలకోసం
వాళ్ళ రేపటికోసం
వాళ్ళ కోసం

రచనా కాలం : 23.01.02

# అనుభవం జారిన జ్ఞాపకం

నా నుంచి ఒక్కో క్షణాన్నీ
ఏదో ఒక మలుపులో పారేసుకుంటూనే ఉన్నాను
జరిగిన ప్రతికాల పుటలోనూ
ఎన్నోఘటనల్నీ వాటి ముద్రలనూ
కాలదన్నుకుంటూనే ఉన్నాను
ప్రతి నిశ్శబ్దం నుంచి ఎన్నో శబ్దాల్నీ
అందులో ప్రవహించే ఎంతో నాదాన్ని జారవిడుచుకుంటూనే ఉన్నాను
ఎన్ని పాటలు మూలుగుల్లో మూగబారి పొయ్యాయో !
ఎన్ని మాటలు పెదాల స్పర్శలోనే అణిగి పొయ్యాయో !
ఎంత వెలుతురు కళ్ళలోనే ఇంకి పోయిందో !
ఎన్ని నెమళ్ళ కదలికలు కాయంలోనే కాలం చెల్లిపొయ్యాయో !
ఎన్ని నిజాలు, ఎన్ని స్వప్నాలు
ఎన్నెన్ని అబద్ధాల పేకమేడలు
యుద్ధాలు, విధ్వంసాలు,

గాయాలు, గాలిపటాలు అన్నీ
రోడ్డు మీద మైలు రాళ్ళలా
వేగంగా వెనక్కి వెళ్ళిపోయాయి
కళ్ళలో నిలువలేక
చెంపల మీద ఘనీభవించలేక
పగిలి బద్దలై ప్రళయాగ్ని సృష్టించిన
బిందువుల్లో
ఎన్ని జీవితాల అనుభవాలు ఆవిరై పోయాయో !
ఎన్ని అనుభవాలు జ్ఞాపకాలుగా మిగిలి పోయాయో !
ఎన్ని జ్ఞాపకాలు పొగిలి పొగిలి ఏడ్చాయో !
ఆదం అవ్వ - అగ్ని పునీత
ఆహవంలో గీత - అలెగ్జాండర్ గుర్రం
శిలువ రాజు - సిద్ధార్థుడు
మహాత్ముడు - మదర్ థెరిసా
బీతోవెన్ స్వరాలు - పికాసో గీతలు
విషం పుచ్చుకున్న విజ్ఞాన శాస్త్రం
కోటలు కూల్చి కూలి వాణ్ణి పలకరించిన ఎర్రజెండా
అన్నీ జారవిడుచుకున్న మనిషి నీడలే
అన్నీ లోలోపల ప్రవహించే జ్ఞాపకాల అలలే
అయినా
క్షణ క్షణానికి ఏదో ఒక కొత్త అనుభవం
అంతలోనే అది జారిపోయిన జ్ఞాపకం

రచనా కాలం : 04.09.01
(నేటినిజం– దసరా : 2001)

# కాగితం

కాగితం ముక్క కనిపిస్తే చాలు
ఆ కళ్ళు ఆకలిగా మెరుస్తాయి
కాగితం ముక్క కనిపిస్తే చాలు
ఆ కాళ్ళు వేగంగా నడుస్తాయి
అది పెంటకుప్పయినా కావచ్చు
పాలెస్ ఆఫ్ ప్రిన్స్ అయినా కావచ్చు
ఆ కళ్ళు చిత్తుకాగితం కోసమే వెతుక్కుంటాయి
ఆ చేతులు చిత్తుకాగితాన్నే ఏరుకుంటాయి
బాటల వెంట తిరుగుతూ
బతుకును దేవులాడుకుంటాయి
అతడు
ఎంగిలాకుల చుట్ట కోసం
పెంటదిబ్బ మీద కొట్లాటకు దిగి

కూటిని కుక్కలకు వదిలేసి
కాగితం ముక్కల్ని మాత్రం
కడుపులో దాచుకుంటాడు
అతడు
కుక్కిన గోతంలో నుంచి
కూటి గింజలు రాలని నాడు
పేగు తెంచి ముక్కలు చేసి
పేపర్ల గోతంలోనే పేర్చుకుంటాడు
అతడు
బతుకు భారాన్ని గోతంలో కుక్కి
నిరంతరంగా సాగిపోయే హెర్క్యులస్
అతడు
యావత్ప్రపంచాన్ని భుజం మీద మోస్తూ
ఎక్కడ గమ్యమో తెలియని అట్లాస్

రచనా కాలం : 02.10.98
ప్రకృతి సాహితి – నవంబర్ 1998

---

# బూచాడు

వాడో అమానవీయ ఆలోచనల కుంపటి !
యుద్ధంలోంచి యుద్ధం కోసం
యుద్ధం చేస్తూ ఆవిర్భవించిన పాలిభూతం
వాడి ఉనికి ఆయుధం,
ఉత్పత్తి ఆయుధం
కడకు వాడి ఊపిరి,
ఊహ కూడా ఆయుధమే

వాడో అశాస్త్రీయ అహంకార తాలింఖానా !
వాడి విద్యలన్నీ విలయానికి మెట్లు
సంపదంతా సమస్యల సృష్టికి ఆటపట్లు
వాడి ఆలోచనకి స్థాయీ భావం చావు
ఒక విధంగా వాడి భూమే చావుల రేవు

వాడో అస్తవ్యస్త అంధకార రక్తపిపాసి !

వాడి రాజ్యాంగంలో సగం అక్షరాలు
రక్తంలో అద్దిరాసినవే
వాడి ప్రభుత్వంలో సగం చట్టాలు
సాటి దేశాల భవిష్యత్ మరణ శాసనాలే

వాడో అనారోగ్య అనాగరిక పరాన్నజీవి !
డాలర్ల చిల్లపెంకుల్ని చల్లి
జబ్బుల జాగీర్లని తలకెత్తుతున్న
వైజ్ఞానిక వలస పురుగు
వద్దన్నా వదలని అగ్రభక్షకుడు

కాలం వాడిష్టం మీదే కదలాలి
గ్లోబు వాడిష్టం మీదే తిరగాలి
గుడ్డ వాడిదే కట్టాలి
వాడు పారేసిన గడ్డే తినాలి
ప్రపంచ మేధస్సును కాజేశాడు
తరతరాల సంస్కృతిని కాటేశాడు
యుగ యుగాల సంప్రదాయాల్ని కూల్చేశాడు
దేశదేశాల చరిత్రల్ని కాల్చేశాడు
చివరకు గోళాన్నే ఎత్తుకు పారిపోతున్న
ఆధునిక హిరణ్యాక్షుడు

వాడి దృష్టిలో మనిషి కంప్యూటర్ ఫ్లాపీ
వాడి సృష్టిలో ప్రాణం డబ్బు కాసే యంత్రం
కలుగులో ఎలుకను పట్టుకోడానికి

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

కాలంతో ఆడుకుంటున్న రాక్షసుడు
వాడిది కాని భూమ్మీద
స్వైర విహారం చేస్తున్న పాశవికుడు
అందుకే
'అమ్మో బూచాడు' అనేది పాత మాట !
'అమ్మమ్మో అమెరికోడు' కొత్త మాట !

రచనా కాలం : 14.12.01
నేటినిజం : గణతంత్రదినోత్సవ సంచిక – 2002

# మళ్ళీ పాడవా

అలల్లా సాగిపోయే మేఘాల్లో
బారులు తీరిన పాలపుంత విహంగాన్నై
అందీ అందని ఆకాశ హర్మ్యాల్లో
తేలి తేలిపోయిన జ్ఞాపకాలు
అక్షరాలుగా చెప్పాలన్న
పిచ్చి ఆలోచనలకు సాక్ష్యంగా
మళ్ళీ పుట్టిన తాన్‌సేన్
కుందన్‌లాల్ సైగల్!
కాననోతో గొంతు కలిపి కమ్మని పాట పాడవా!

ఎత్తు తెలియని హిమశిఖరాల చుట్టూ
దిక్కు తోచని గిరికీలు కొట్టి
గుండె లోతుల్లోకి జారిపోతూ
అవయవాలు స్తంభించి

ఆశ్చర్య లోకాల్లో తేలియాడిన
రాగ క్షణాలను కవిత్వీకరించాలనే
పిచ్చి ప్రయత్నానికి సాక్ష్యంగా
బడే గులాం !
ఒక్క తుమ్రీ మళ్ళీ పాడవా !

ఆకాశ దివిటీ నీడలో
వెన్నెల పిట్టలా రెక్కలార్చుకుంటూ
వేదనా మైదానంలో
మనసు కందనంత దూరంగా
నింగి అంచుల్లోకి పారిపోయిన
స్వర తారకల చిత్రాల్ని
రంగులద్ది చెప్పాలన్న
పిచ్చినమ్మకానికి సాక్ష్యంగా
గజల్ రాణీ ! బేగం అఖ్తర్
అబ్బాసీ కోసమైనా
హార్మోనీ రీడ్ సారించలేవా !

ఋతువు మారిందని వలస పోయిన కోయిల
ఎక్కడ నుంచి పలకరించినా
పలికే గుండె నాకుంది.
భూమిని పంచుకున్న దేశాలు
పాటను పంచివ్వగలవా
శరీరం విడిచి పెట్టి
స్వరంలో జీవిస్తున్న
నూర్జహాన్ !

స్మృతి తప్ప మృతి ఉండదని
ఋజువు చేసిన సరోద్ ! !
పాటలు కోసుకున్న కాలాన్ని
నా
గానకలల్ని నిజంచెయ్యడానికైనా
ఒక్కసారి మళ్ళీపాడవా !

రచనా కాలం : 01.04.02
'పత్రిక' సెప్టెంబర్ 2002

# కదన కుతూహలం

మంచుకొండలు మండిపోతున్నాయి
కాపలా కాయలేక గుండెపగిలి
లావాలై ప్రవహిస్తున్నాయి
కార్గిల్ కొండలోయల్లో
రాతియుగం నాటి మతపిచ్చి సంస్కృతి
తప్పకుండానే బైట పడింది

హద్దురేఖ గీయలేని వాగ్దానాలు
కాపలాబతుకులతో జూదమాడుతున్నాయి
అమరనాథుడు సాక్షిగా
కాశ్మీర బాంధవ్యంలో
తొలినాటి అధికారం ప్రతిష్ఠించిన
పొలిమేర దేవత సాచిన నాలుక

పిచ్చి ముళ్ళినప్పుడల్లా
పచ్చి రక్తం రుచి చూస్తుంది

పాదాలకున్న పసరుపోతేగాని
అమాయకుడైన ప్రవరాఖ్యుడికి
హిమాలయం అసలు రూపం తెలియలేదు
అక్కడున్నది అందం కాదనీ
అమాయకుల్ని బలితీసుకునే
పిశాచ గృహమనీ బోధపడలేదు

పసికిరి నిండిన కళ్ళతో చూస్తే
అంతా పాకిస్తానే ననిపిస్తుంది
అగ్రరాజ్య చదరంగంలో
పావులెప్పుడూ పచ్చదనం వైపే
గతాన్ని తవ్విచూడు
గెలుపులన్నీ మనవే !
గెలుపు గెలుపుకీ భూమిని
ఇచ్చుకోవడమే గాని
పుచ్చుకున్నదెప్పుడు
పురిటిలో తప్ప

త్యాగాల్ని కూడా
ఓటు యంత్రాలతోనే కొలుస్తున్నారే !
పవిత్రంగా సమర్పించే ప్రాణాల్ని కూడా

గజ్జి చేతుల్తోనే స్పృశిస్తున్నారే !
అధికార ప్రిజంలో కార్చిచ్చు నుంచి కూడా
విబ్‌జియార్‌నే వెతుకుతున్నారే !
ఎంత వింత ప్రాణులీ రాబందులు
అయినా చెబుతున్నాను
మురికికాల్వలన్నీ ఎటు ప్రవహిస్తున్నా
పదవుల పైరవీలన్నీ ఏమినిర్ణయించినా
నూరు కోట్ల ప్రజాకంఠాల్లో ఒకటే పలుకు
అదే కాశ్మీర కదనకుతూహలం !

రచనా కాలం : 27.06.99

నేటినిజం తొలి ప్రత్యేక సంచిక

# నటుడు

మాటను పాటగా పలికినవాడు
చూపును పాత్రగా మలచినవాడు
పాడిన ప్రతి పాటతో పండితుల్ని కదిలించినవాడు
వేసిన ప్రతి పాత్రతో వేనోళ్ళ పొగడ్తలందుకున్నవాడు
కళ్ళలోంచి, కలల్లోంచి
కాలంలోంచి పాటను పిండుకున్నవాడు
పవిత్రుడు, పసివాడు
పాపం తెలియనివాడు
పాత్ర మాత్రమే తెలిసినవాడు
అక్షరాలా కళాకారుడు

అంతరాలకు అందనివాడు
అలివి మాలిన దానం చేస్తూ
అంబరం నుంచి ఊడిపడ్డ బలి

సముద్రమంత సంగీతాన్ని
చూపులతోనే ఆపోసన పట్టిన రవి
వెంపలి చెట్లకు వేస్తున్న ప్లేబాక్ దోటీలకే
తలవొగ్గి నిలబడ్డ హిమశిఖరం
తల్లినేల తననెంత వంచించిందో
తలచుకుని తల్లడిల్లి కళ్ళుమూసుకున్నాడు
కాలాన్ని కప్పిపుచ్చుకున్నాడు.
చెన్నపట్నంలో చైతన్యం లేని
ప్రతిమను మాత్రం మిగుల్చుకున్నాడు
అతను అతనికి మాత్రమే కానివాడు
సినిమాలో సినిమానే కోరుకున్న
అందరి కళ్ళలోనూ జీవిస్తూనే ఉన్నవాడు

రచనా కాలం : 28.03.00
మహానటుడు చిత్తూరు నాగయ్య
జయంతి సందర్భంగా

# మండుతున్న తల

పొలిమేరలో కాపలా కాస్తున్న
వాస్తవాధీన ప్రాణాలు
అదుపు దప్పిన క్షుద్ర మతాయుధాలకు
బలి పశువులౌతుంటే
మంచుకొండలు కరిగి కన్నీరై ప్రవహిస్తున్నాయి
కాని !
దివాలా దీసిన ఢిల్లీ రాజకీయాలు కనీసం
దీపమైనా పెట్టలేక పోతున్నాయి

రాత్రంతా నెగళ్ళై తల్లినేల కోసం
తపించిన చూపులు -
మహాపర్వత పంక్తుల్లా మాతృభూమిని
చుట్టి వేసిన చేతులు -
భుజాన తుపాకీ పేరుతో భూభారాన్నే
మోసిన దేహాలు -

---

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

ఊరూ వాడా లేని చోట
ఊరడించే దిక్కులేక
నిర్జీవ ప్రతిమలై కూలిపోతే
ఎదురుచూసే తల్లి ఏరై ప్రవహించింది
ఏరు దాటిన ఓట్ల గిత్తలు మాత్రం
ఏమీ ఎరగనట్లు మైకుల్లో
ఎంగిలి కురిపిస్తూ మైమరచి పోతున్నాయి

రక్షణ శాఖలో సిగ్గులేక రాసలీల లాడుకుంటూ
శిఖరాగ్ర చర్చల పేరుతో
చిచ్చుబుడ్లు పేల్చుకుంటూ
సరిహద్దు శవపేటికలకు మాత్రం
దర్బారు హాల్లో కంటితుడుపుతో
చక్రస్నానం చేయిస్తున్నాయి

పర్వత సానువుల్లో మూగబోయిన చావుకేకలు
పల్లెటూళ్ళో తల్లి పేగుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి
గుమ్మంలో నిరీక్షించే పసుపుతాళ్ళు
ఉరితాళ్ళై ఉసురు పోసుకుంటున్నాయి
ఉనికి తెలియని పాలపిట్టలకు
తండ్రులు జ్ఞాపకాలుగా మిగులుతున్నారు

అమ్మా !
అలా చూస్తావేం !
ఎన్ని ఆత్మల మూగవేదన నిన్ను శపిస్తుందో !

ఎందరు తల్లుల కడుపుకోత నిన్ను ప్రశ్నిస్తుందో !
ఎందరి కన్నీరు వరదలై నిన్ను ముంచెత్తుతుందో !
నీ తలమీద కాశ్మీరం కార్చిచ్చై రగులుతుంది
నీ గుండె గుజరాతై పగిలి పోయింది

రచనా కాలం : 15.08.99
ఒకవైపు గుజరాత్ భూకంపం
ఒకవైపు కార్గిల్‌లో ప్రాణ నష్టం
చూసి స్పందించి

# పద్యం మూగబోయింది

ఆరు దశాబ్దాలు హార్మోనియం రీడ్
అవాక్కై మూగబోయింది
ఐదు తరాల శ్రీకృష్ణుడు అమరుడై
గంధర్వ లోకం వెళ్ళిపోయాడు
కాలి అందె జారిపోయిందని
కన్నీరు పెడుతున్నాడు నటరాజు
వన్స్‌మోర్ ఉనికైన రంగస్థలం
భాష్ప సంగీతమై కరిగి పోయింది
ఆంధ్ర బాల గంధర్వుడు
అమరలోకం వెళ్ళిపోయాడు
గ్రామ్‌ఫోన్ గీతలో పిన్నై
గిరికీలు సృష్టించిన వాడు
పాత్రకు గాత్రాన్ని చుట్టి

విద్యుత్తు ప్రవహింపజేసిన వాడు
పలుకు పలుకులో లయలు పలికించిన షణ్ముఖుడు
రాగ సాగరాన్ని లంఘించిన అభినవ ఆంజనేయుడు
రంగుల పరదాల వెలుగుల్లో మకుటం గల మహారాజు
కృష్ణుడు, కుచేలుడు, గయుడు,
రాముడు, రామరాజు,
నారదుడు, నక్షత్రకుడు -
రాత్రికో రూపాన్ని ధరించినవాడు
రాళ్ళు కరిగే రాగాలు పలికించిన వాడు
ప్రాణమే పద్యమై పలికినవాడు
పద్యమే పతాకమై వెలిగినవాడు
రంగుల్లో రాగాలు చిత్రించిన వాడు
బతుకే రంగస్థలమై నిలచిన వాడు
స్మృతులు మిగిల్చి వెళ్ళి పోయాడు
చితిలో కూడా గాంధర్వమే పలికిస్తున్నాడు
ఆంధ్ర నాటక రంగంలో
నిన్నటి తరానికి ప్రయోగదీపిక
నేటి తరానికి సంగీత పాత్య ప్రణాళిక
రేపటి తరానికి మిగిలే చేతిలో చరిత్ర

(ప్రఖ్యాత రంగస్థలనటులు "ఆంధ్ర బాల గంధర్వ"
శ్రీ షణ్ముఖి ఆంజనేయరాజు
ఆకస్మిక మృతి సందర్భంగా వారిని స్మరిస్తూ –)

# గొంగళి పురుగు

నేను నేను కావడానికి చేసిన యజ్ఞంలో
సమిధను నేనే, ఆజ్యాన్ని నేనే
చివరకు బలిపశువునూ నేనే
ప్రారంభించిన చోటికే ప్రయాణిస్తున్న
విస్తృతమైన అవృతయానంలో
కారుకారుకీ ఆకులను కోల్పోతున్న వృక్షాన్ని నేను
ఋతువులు మారినా చిగురులు రావడం లేదు
బతుకు బీడులో కురిసి కురిసి
వర్షం కళ్ళలోనే ఇంకిపోయింది
మలుపు మలుపులో సజాత శత్రువులు
చుట్టుముట్టిన అభి'మాన్యుణ్ణే'- నేను
అందినంత వరకు వొలుచుకోవడంలో
అందరికీ ఆనందమే !
అందించడంలో అలసిపోవడం నాకూ సంతోషమే !

ఒక అనుభవం నుంచి

ప్రేమ, ఆరాధన, బాధ్యత, ఆనందం, కీర్తి
ఎన్నెన్ని అందమైన పూలు
పూయగానే రాలిపోతున్నాయి
చూడు నేస్తం !
పూతపూయలేని వార్ధక్యంలో
నా తీగపూలే నన్ను వెక్కిరిస్తున్నాయి
అవును
సీతాకోకచిలుకకు
గొంగళి పురుగు ఏమౌతుంది
మండుతున్న సూర్యుడికి
ఒదిగి వెలిగే చిరుదివ్వెకు
చుట్టరికం ఏమిటి?
అశక్తత ఎంత భయంకరమైంది
మోయలేక పారిపోతున్న ప్రాణాన్ని ఆపడం
చంపడమే అవుతుంది

రచనా కాలం : 02.02.01

# స్పృహ

అసామాన్య నిగళాల్లో చిక్కుకున్న
కావ్య రూపాల్లో
అతి సామాన్యుణ్ణి - నేనెక్కడున్నాను
శక్తివంతమైన పాండిత్య బంధాల్లో
ఎంత వేదాంతం ! ఎంత విజ్ఞానం !
ఎంత సాహిత్యం ! ఎంత పరమార్థం !
పట్టు పురుగులు కట్టుకున్న గూడులా
కళ తనకు తానే తన చుట్టూ
ఎంత పెద్ద మెరుపుల వల అల్లుకున్నది
ఎంత పెద్ద పాండిత్యపు ఇనుపగోడ కట్టుకుంది
ఈ గూడు కింద పెరిగిన భాషాస్వాములు
తమకు తామే అందనంత ఎత్తులో జీవిస్తారు
తమది కాని జీవితాన్ని స్వర్గంగా భావిస్తారు
ఇక్కడ ఒకరికొకరు అందక పోవడమే గొప్ప స

ప్రజలకే గాదు, పాలకులకూ వీళ్ళంటే భయం
అందుకే వీళ్ళను పోషిస్తారు, పూజిస్తారు
సజీవ వర్తమానాన్ని మరచి
నిర్జీవ గతాన్ని నెమరు వేసుకునే
ఒకానొక త్రిశంకు స్వర్గాన్ని వీళ్ళకు బహూకరిస్తారు
కనిపించే నిజాన్ని విస్మరించి
గంధపు వాసనతో పాగ చూరిన
గతానికి ప్రాణంపోసే
'కళారాధన'లో వీరు కాలాన్ని నింపుకుంటారు
వీళ్ళకు మనుషులక్కరలేదు
మానవత్వం అక్కర లేదు
తమకు తప్ప ఇంకెవ్వరికీ పట్టని
నిరంతర యమ నియమాల్లో పొర్లాడుతుంటారు
మనిషికి విరుద్ధమైన దిశలో
శుద్ధత్వాన్ని సృష్టించుకుంటారు
మృగ్యమైన మౌలిక విలువల్లో
ఆగామిని ద్వేషిస్తారు
ఎవరికీ అంటనంత దూరంగా ఉండడానికి ఇష్టపడతారు

తాము గుర్తించిందే కళ
తమ కిష్టమైందే పాండిత్యం
ఆధునిక సంప్రదాయ కావ్యాలకు చేర్చిన
నకిలీ సర్టిఫికేట్ 'సామాజిక స్పృహ'
సమాజానికందనంత దూరంలో
పాండిత్యం పచార్లు చేస్తుంటే

---

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

అందులో సామాజిక స్పృహేమిటి?
అర్థంలేని మాట

ఓ పండితుడా !
నీ ప్రబంధంలో లేకపోవడమే నాకిష్టం
నాది కాని లోకంలో నాకెందుకు చోటు
నాకు తెలియని మాటల్లో
నేనెందుకు నలిగి పోవాలి
నేను మట్టిలో పుట్టిన వాణ్ణి - మనిషిని
స్వేచ్ఛా సూర్య కిరణ స్పర్శను కోరుకునే వాణ్ణి
ధగ ధగలాడే బంగారు సంకెళ్ళు నాకొద్దు
జాతి జీవన సౌగంధాన్ని చిందించే జానపదమే నా పథం
మానవతలోంచి పరిమళించే
ప్రతిభాప్రవాహ జ్ఞాన పథమే నా పథం

రచనా కాలం : 10.04.01
విశాలాంధ్ర
(పెరల్.ఎస్.బక్. భావాలకు స్వేచ్ఛానుసరణ)

# నాదం నుంచి నాదంలోకి

ఆ వేళ్ళు తీగలపై కదిలితే
గుండెల్లో మహా పర్వతాలు దొర్లిపోతాయి
ఆ కళ్ళు వేళ్ళ మీద సారిస్తే
విశ్వగోళాలు బంతుల్లా ఎగిరి పోతాయి
తీగ కదిపిన తరంగాల్లో
ప్రాణం తేనై ప్రవహిస్తుంది
అది ఊపిరి నాదం కావచ్చు
ఓం కారం కావచ్చు
ఏదైతేనేం
జడం ప్రాణాన్ని జయిస్తుంది
ఎద ఏదో లోకాల్లో విహరించి
భూమికి దిగి రానంటుంది
ధృతి మించిన దూరంలో
కాలం ప్రాణంతో లయిస్తుంది

---

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

మంద్ర స్వరారోహణంలో
మాధుర్యం మూర్ఛనలు పోతుంది
శరణ్ అంజాద్ సరోద్ కావచ్చు
రవి, విలాయత్ సితార్ కావచ్చు
ఫిడేలు నాయుడి వేళ్ళ నాడులు కావచ్చు
లాల్ గుడి ప్రాంగణంలో
రాళ్ళ ద్వారాలు కావచ్చు
ఎవరు మీటితేనేం
తీగలు నా చుట్టూ చుట్టుకుంటున్నాయి
నన్ను నా నుంచి వేరు చేసి
నన్ను నాకు చూపించి
నన్ను నన్ను చేసే నాదం
నా నుంచి వేరు కాదనేది నిజం

రచనా కాలం : 10.05.99

–ప్రకృతి సాహితి : జులై 1999.

# స్కానింగ్

బిడ్డ పేగులో తీతువు పిట్ట కూస్తుంది
తల్లి ప్రేమకే తప్పుడు భాష్యం పలుకుతుంది
మానం మందు పాతరౌతుంది.
మనిషి రక్తం వైతరణి ఊటగా మారుతుంది
పుట్టక ముందే బిడ్డ ప్రేతమై అరుస్తుంది
పురిటి పాన్పు మీద నుంచే శవయాత్ర సాగుతుంది
ఊపిరి పోసిన పచ్చి పేగులే
ఉరికొయ్యలై ఊచకోత కోస్తున్నాయి
వంచన తెల్లముసుగు ధరించి మాతృత్వం
వంటగదిలోకి పారిపోయింది
మానవుడు దానవుడుగా మారి
దౌర్భాగ్యంలో భాగ్యాన్ని దర్శిస్తున్నాడు
ఆధునిక విజ్ఞాన శాస్త్రం

---

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

అవమానంతో తలదించుకుంది
రేపటి అసుర సంధ్యను తలచుకుని
ఇవాళే జీవం మూగబోయింది
తలపులో తల్లిఘోష
నెత్తురు మడుగై ప్రవహించింది
వల్లకాటి ఆస్తిని ఆసుపత్రి కబళించి
గాజు గుడ్డల్లో దాచిపెట్టుకుంది
ఊరుచివర కుక్కలూ, నక్కలూ
వేదాంతం చెప్పుకుంటున్నాయి
అహంకారం ముందు
అమ్మతనం ఓడిపోయింది
పుట్టనున్న ఆడపిల్ల
తనకుతానే పారిపోయింది

రచనా కాలం : 97
(ఆంధ్రజ్యోతి సాహిత్యవేదిక)

# పంజరంలో అమ్మ

మా ఊరిని తలచుకోవడమంటే
మూడు దశాబ్దాలు వెనక్కి వెళ్ళడమే !
అలల్లా సాగిపోతున్న స్మృతుల్లో
అనంతమైన జ్ఞాపకాలు
గట్టుదాపల గూడెంలో
కోడికూసి సూర్యుడికి తలుపు తీసేది
చిగురించిన మామిడాకు దోనె చివర
జారుతున్న
మంచు బిందువులో
ఇంద్రధనస్సు అద్దం చూసుకునేది
తోపు మూలల్లో కూసే తొలకరి కోయిల
మనసు మీద దాడి చేసేది
కిలకిల రావాల మధ్య కీచుమంటున్న
పంచమ స్వరంలో చిక్కిన ప్రాణం

సాగిపోతున్న పిట్టలతో పాటే
పరుగులు తీస్తూ పచార్లు చేసేది
పొద్దున్నే డొంకలో పరుగులు -
కాలికంటుకున్న దుమ్ము
కావిళ్ళు నింపుకునే గుళ్ళకమ్మ రేవు
నీలాటి రేవులో తడిసి తట్టుకునే పరికిణీలు
ఇసుకలో పిచ్చుక గూళ్ళు - పండిన పుచ్చకాయలు
కట్టమీద రేగు ముళ్ళు -
ఈతలో చిందే నీళ్ళు - చిందుల్లో మెరిసే నవ్వులు
కల్లంలో కలకలాలు - కలికి చూపుల కలవరింతలు
చెంగున ఎగిరే లేగదూడ
నాట్యం చేసే కవ్వం - చుయ్ మని పాడుతున్న చల్ల
చిలిపి దొంగ తనాల్లో చిక్కుకున్న వెన్నముద్ద
ముద్దుగా పరిమళించే ముగ్గులు
గంగిరెద్దుల సన్నాయి - హరిదాసుల చిందులు
కిలకిల మంటూ పలకరించే ఊరబావి గిలక
పందెపుబండ లాగి రంకెవేసిన గిత్తలు
జీతగాడి దోసిట్లో కూటి దుత్త
వేళ్ళ సందున ఊరించే చింతకాయ పచ్చడి
నీలాకాశంలో చుక్కల్లా
నుదుటి మీద స్వేదబిందువులు జారే అమ్మలక్కలు
మంచె మీద తారాజువ్వలాంటి పడుచు వడిశాల
వంగిన పాల పిట్టల్లా పైరజొన్న కంకులు
గోధూళిలో గంగడోలు కదలికలు
గలగలమంటున్న గంటలు

సందె పొద్దు సరాగాలకు తాళం వేసే గాజులు
సగం సగంలో చేతికందక జారిపోయే అనుభూతులు
వెన్నెల్లో వెచ్చగా విచ్చుకున్న పల్లె మా ఊరు

అమ్మలా, విరులు విప్పారిన కొమ్మలా
చల్లగా, ఆనందపు హరివిల్లుగా పండిన పల్లె మా ఊరు
కలల అలల్లోంచి జారిపోతూ
బస్సులోంచి ఒక్కో మెట్టు దిగాను
మాసిపోయిన రంగుల చిత్రంలా
ఊరెంత మారిపోయింది

చమురు చాలక కొన ఊపిరితో
వెలుగుతున్న చందమామలా
మా ఊరెంత వాడి పోయింది
అనుభవాలన్నీ అలసిపోయి నిద్రపోతున్నాయి
జ్ఞాపకాలు రాళ్ళుతగిలి రాలిపోతున్న గువ్వలయ్యాయి
ఊరు ఊరే నన్ను ఓరగా చూసింది
కల్తీరంగుల ముఖాల్లో నమ్మకం చచ్చిన  చూపులు
దిక్కుతెలియని ధన దాహంతో
దీనంగా బతికే బతుకులు
మానవ ముఖాలతో జంతువులు తిరుగుతున్న
జనారణ్యంలా ఉంది

ప్రతిమనిషీ తనతో తాను వ్యాపారం చేస్తున్నాడు
ప్రతివాడూ ఎదుటి వాడికి
అపరిచితుడుగానే నడుస్తున్నాడు

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

బంధాలన్నీ ఆర్థిక మూలాల్లో చిక్కుకున్నాయి
చదువులు సంతలో బేరమాడుతున్నాయి
వృత్తులు గోడకు వేళ్ళాడుతున్నాయి
ప్రతియిల్లూ వాకౌట్‌లో చిక్కిన అసెంబ్లీ హాలులా ఉంది

ఊరు పూరంతా
బ్యూటీ పార్లర్లలో అందాన్ని కొనుక్కుంటుంది
పరిగెత్తే కాలంతో ప్రవహించలేక
గుండె ఎండిన గుళ్ళకమ్మ
మార్కెట్‌లో వసంతాన్ని
మారుబేరానికి మార్చుకుంటుంది

ఆకులు రాలడంతోనే అలసిపోయి
చిగురించడం మరచిపోయిన మఱ్ఱి చెట్టు,
దారి తప్పిన రాముడికోసం తపిస్తున్న అహల్యలా
ఊరిమధ్యలో ఊపిరిలేని బొడ్రాయి,
అపార్ట్‌మెంట్స్‌గా మారిన చింతతోపు
మిత్రలాభంలో బోయవాడి వలలా పవర్ తీగలు
ప్రణాళికలో పులుంకున్న పచ్చదనం
యూనిఫారంతో ఇంగ్లీషు వాసన కొడుతున్న వీధిబడి
దుర్గంధం మోస్తున్న రోడ్లు
వాటినాక్రమించిన దుకాణాలు
బ్లాక్‌టికెట్‌తో బతుకుతున్న సినిమా హాళ్ళు
పగలు ప్రపంచ రాజకీయాల తీర్పులు
రాత్రులు మానాన్ని కోసి అమ్ముకునే మాంస వ్యాపారులు

ఊహాతీత స్వప్నంలో
వొయ్యారంగా
దిగంబరంగా
దీనంగా
దిక్కుమాలిన జీవన చదరంగంలా
ఆకాశంలోకి చూస్తుంది నా ఊరు

కొండ కింద మెరకచేలో
కోటేలు తిప్పడం మరచి పోయి
కోరికల హార్స్ రేస్‌లో
మీసాలు తిప్పుకుంటుంది
వీదేశీ విలువలకోసం
పంటపొలాలు చేపల చెరువులై
వెక్కిరిస్తున్నాయి

చెట్టూ-పుట్ట; దారీ - డొంక
పైరూ - పంట ; గొడ్డూ - గోద
ఇళ్ళూ - వొళ్ళు ; మళ్ళూ - గుళ్ళు
రహదారులు - రాజకీయాలు
అంతెందుకు
చదువు - సంస్కారం
కలం - కవిత్వం కూడా
కుల గజ్జితో కుళ్ళి పోతున్నాయి
గుర్రపుడెక్కలా బలిసిన ఈ గజ్జికి
ఫెర్టిలైజర్స్ తప్ప పెస్టిసైడ్స్ దొరకడం లేదు

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

పసుపు కుంకంతో పచ్చగా బతికిన నాపల్లె
పాలడిపో ఎలెక్షన్‌లో కూడా
పచ్చిరక్తం కళ్ళజూస్తుంది
ఏడాది కష్టపడ్డ పంటలో
ఎలెక్షన్ తగాదా నిప్పుపెట్టింది
చేసేదిలేక గ్రామాభ్యుదయ స్కీములో చేరి
బ్యాంకులో చక్రవడ్డీకి
బతుకునే తాకట్టు పెట్టుకుంది
పంజరంలో చిలుకను చూసి పోటీపడే
బోనులో ఎలుకలా

నగరంకంటే నాకేం తక్కువనుకునే
నా పల్లెను చూడలేక
తల్లిపోలిక లేని కృత్రిమ శిల్పాన్ని పోల్చుకోలేక
నాకు నేనే తలవంచుకొని -
నాకు నేనే కుంచించుకొని -

రచనా కాలం : 12.02.01
నేటినిజం ఉగాది సంచిక 2001

# నల్ల కంబళి

నెత్తురు బొట్టు నేల తాకితే
వేల శక్తులుద్భవిస్తాయని పురాణాల్లో విని
ఏమోలే అనుకున్నాను
అన్నా !
నీ పాట గాలిసోకితే
వేల వేల విప్లవ వీరులుద్భవిస్తారని
కోట్ల గొంతుల కోరస్
నిరూపిస్తుంటే ఆశ్చర్యపోతున్నాను
గుండె చీల్చి
గూడు చేసి
దీపం వెలిగించగల
నీ కళ్ళలో
గురి చూడగల మొనగాడెవడు
పిరికి వాళ్ళు

తుపాకీని అరువు తెచ్చుకున్నారు
బతుకునే పాటగా కోసిచ్చిన నిన్ను
పాటకు రక్త మాంసాలు పోసిన నిన్ను
పాటకు పరిమళం అద్దిన నిన్ను
పాటతో ప్రళయాన్ని సృష్టించిన నిన్ను
అరచేతిలో దాచడం
ఫాలాక్షునకైనా వశమౌతుందా

ఆర్తనాదం
మూర్తీభవించిన పాటను
అంపశయ్య మీద
వలపన్ని బంధించడం
సాధ్యమౌతుందా?
ఆకాశమంతా నిండిన పాటను
కసాయి శాసనాల తుపాకులు
కటకటాల్లో దాచగలవా?

పతాకమై
ప్రభవించిన జీవితాలను
ప్రభుత్వాలేం చేయగలవు?
పతంగమై
ఎగిరిపోయే జీవితాలను
పోలీసు కుక్కలు పట్టగలవా?
గద్దర్ -
నీ భుజం మీద
నల్ల కంబళి నాట్యం చెయ్యడం

మట్టిమనిషి శివమెత్తినందుకు
చిహ్నం కాదా !
నీ చేతిలో లయలు పలికే డప్పు
పుడమితల్లి పునః సృష్టికి
ఢమరుకం కాదా !

రచనా కాలం : 99
(ప్రజాకళాకారుడు గద్దర్ కోసం.)

# ఆవిడ లేని రాత్రి

ఓర్పుకు ఓదార్పు లేదు
మార్పుకు తీర్పు లేదు
చూపుకు రూపు లేదు
మాటకు మాధుర్యం లేదు
వెరసి నిర్జీవ స్వప్నం
అంధకారం అమావాస్యది కాదు
ఆడది లేని రాత్రిది

అవును
ఆవిడ లేని రాత్రి
కాళ రాత్రే కాదు
కాటు వేసిన రాత్రి
చీకట్లో దీపం వెలగదు
వెలిగినా అది అవసరాన్ని బట్టి

ఏమూలనో ఒదగదు
మినుకుమనే చూపులూ ఉండవు
కునుకు తీస్తే కోపం ఉండదు
కోరికల కొసరింపుకు కూనిరాగాలు లేవు
ఆ రాగాలకు లయలు కులికే అందెల పలుకులు లేవు
అంతా నిశ్శబ్దం
ఇల్లు - అడుగులు
గుండెలు - ఆలోచనలు
ఆ మాటకొస్తే
వినబడే పాటలు - సారించే సంగీతం కూడా

తలారబోసిన భ్రుకుటి బింబం
ఉదయాన్ని తట్టి లేపితే
అది ఉగాది ...
తలపులార బోసుకున్న అధర ద్వయం
పకపకా ప్రవహిస్తే
అది యుగాది ...

పసుపు రాసిన పాదద్వయంలో
పవిత్ర భాగీరథి ప్రవహిస్తే
గలగలలాడే గాజుల ధ్వనిలో
సిద్ధేంద్రుని చిద్విలాసం వినిపిస్తుంది

అవ్యక్తమైన ద్వంద్వ మాధుర్యంలో
తాగినకొద్దీ తన్మయత్వం
నన్ను నేను కోల్పోయిన క్షణంలో

ఊపిరి ఉనికి ఊహ
అన్నిటా తానే !

అందుకే -
ఆవిడలేని రాత్రి
సూర్యుడు లేని పగలు
శృతి లేని సంగీతం
జీవం లేని దేహం
ఓ భగవాన్ !
నీకు సర్వదా కృతజ్ఞుణ్ణి !
నా సగాన్నే నాకు సర్వస్వంగా
ఇచ్చినందుకు -

రచనా కాలం : 02.02.02

# ప్రపంచమే ఆయుధమై పేలితే

అవును
మనిషి జీవితం ఆయుధమై పోయింది
మనిషి ఆలోచన ఆయుధోన్ముఖంగా పరిగెడుతుంది
విజ్ఞాన శాస్త్రం ఆయుధంగానే రూపుదిద్దుకుంటుంది
బతుకు పుస్తకంలో ప్రతి పుటా పేలుడు పదార్థమే
అదుగో చరిత్ర తవ్విచూడు
మలుపు మలుపులోనూ రక్తపు మరకలే సాక్ష్యం చెబుతున్నాయి.
మతం ముసుగులో మధ్యధరా తీరం
పవిత్రత చాటున ప్రవహించిన పాలస్తీనా రక్తం
చెంఘీజ్ ఖాన్ చైనా విధ్వంసం
ప్రపంచ యుద్ధాల ప్రచండ ఘోష
హిట్లర్ చేతిలో హిరోషిమా
ఎందరు ఆయుధాలై పేలిపోయారు
అన్నీ చెరిగిపోని నెత్తురు చారికలే

వర్తమానంలో కూడా ప్రతిమలుపులో
విస్ఫోటన దృశ్యాలే !
కొత్త మిలీనియం ఆయుధాన్నే స్వాగతించింది
ఆకలికి ఆసరా ఆయుధమే
అణచి వేతకూ ఆయుధమే
బిగించిన పిడికిట్లోనూ ఆయుధమే
తెగించిన సహనంలోనూ ఆయుధమే

ఇవాళ అణుబాంబులోంచే అక్షరం పుడుతుంది
మందుపాతరలోంచే మమకారం తొంగిచూస్తుంది
ఆయుధాల చప్పుళ్ళే అమ్మ పాటలవుతున్నాయి
అగ్నిలోంచి పుట్టిన అడవి బిడ్డలు
పుడుతూనే ఫిరంగులౌతున్నారు
ఆయుధాల నీడల్లోనే
ఆలయాలు పురుడు పోసుకుంటున్నాయి
మతం చేసిన మారణహోమాలు
మనిషి భవిష్యత్తును ప్రశ్నార్థకం చేస్తున్నాయి
మరో ప్రపంచ యుద్ధం పీడకల ముందు
మనిషి మంత్రాలు వల్లిస్తూనే ఉన్నాడు
మానవేతిహాసపు ఆధిపత్య పోరాటంలో
అణువణువునా రక్తం చిందిస్తూనే ఉన్నాడు
ఫలించని ప్రజాస్వామ్యం లాంటి

వెలసిపోయిన నా జెండాలో
ఇవాళ ధర్మ చక్రం కనబడ్డం లేదు
కాషాయం, ఆకుపచ్చ మధ్య రగులుతున్న
కాశ్మీరం కనిపిస్తుంది

రచనా కాలం : 20.11.00
నేటినిజం - 2001 రిపబ్లిక్ డే.

# మగ మృగ దాహంలోకి.

కడుపున పుట్టిన బిడ్డైనా కావచ్చు
కాలం కలిపిన తోడైనా కావచ్చు
ఆడదానివైతే చాలు
అడ్డం తొలిగించుకుంటాను
జాతి తలవొంచుకుంటే నాకేం
సిగ్గుతో చితికిపోతే నాకేం
నేను మగాణ్ణి !
మనిషితోలు కప్పుకున్న మృగాన్ని !
తల్లిని కూడా ఆడదిగా చూసే
అనాగరిక సంస్కారం నాది
బిడ్డను కూడా బానిసగా భావించే
ఆటవిక విజ్ఞానం నాది
నా దేశపు బలహీనతల్ని పాలిస్తున్న
ముక్కోటి దేవుళ్ళు సాక్షిగా -

మానవత్వాన్ని వ్యాపారంగా మలచుకున్న

మృగాన్ని నేను

నా దేశం నాకెంత నేపథ్యాన్నిచ్చింది

మనిషి రక్తాన్ని అర్పణ చేస్తే

మహాభక్తుడని దీవించిన రోజులేదా

మానవ రక్తంతో మహీతలాన్ని తర్పణ చేస్తే

మహా వీరుడని కీర్తించిన రోజుల్లేవా

తండ్రి మాట మీద తల్లిని వధిస్తే

అవతార పురుషుణ్ణయ్యాను గాని

ఆటవికుణ్ణయినానా

పెళ్ళాన్ని పేలాలేగించి పైరవీలు సాగిస్తే

పేరెంట్స్ కూడా పైసలే లెక్కజూసుకున్నారు

నిన్నగాక మొన్న

కన్నబిడ్డనే కాసుల కోసం బలిస్తే

ముక్కు మీద వేసుకున్న వేలు

మూడో నాటికే దిగిపోయింది

ఇప్పుడు నేనెంతగా ఎదిగి పోయానంటే

నాకే పుట్టిన, నా చేతుల్తో పెంచిన

నలుగురాడ పిల్లల్ని చంపి

నూరుకోట్ల మందిని తలదించుకునేలా చేయగలిగాను

ప్రేమ సూత్రాన్ని పదే పదే వల్లించే దేశం

నాకు మరణశిక్ష విధిస్తుందా?

---

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

ఆధునిక భారతీయ శిక్షాస్మృతి సాక్షిగా చెబుతున్నాను
చచ్చిన ఆడపిల్లల ఆత్మలే
నాకు ప్రాణభిక్ష కోరుకుంటాయి.
మరో ఆడతనాన్ని చంపేందుకు
సహకరిస్తాయి.

రచనా కాలం : 23.11.99
అనంతం ఫిబ్రవరి 2000
(నవంబర్ 21.1999 భాగ్యనగరంలో కన్న తండ్రి చేతిలో హతులైన
రేణమ్మ, రాణి, భాగ్యమ్మ, సోనీలకు నాలుగు కన్నీటి చుక్కలు విడుస్తూ)

# మట్టి కూడా మాధుర్యాన్నిస్తే'

మట్టి నాకు అమ్మేకాదు, అమృతం కూడ
మట్టి నాకు అన్నం ముద్దే కాదు, ఆత్మజిజ్ఞాస కూడ
మట్టిలోంచి పుట్టిన నా వేళ్ళు
మట్టిని చిలికి మాధుర్యాన్ని తీస్తున్నాయి
మట్టిని పలికిస్తున్నాయి
నాలో జీవ చైతన్యం నింపిన మట్టితో
నాది ఋణానుబంధమే కాదు
నాదానుబంధం
అమృతానంద సంధానం
నా తపస్సులో నేను పగిలి మృత్తికనై
నా స్పర్శలో నేను రగిలి చైతన్య చేతనన్నై
నన్ను నేను పలికించుకున్న వర్తమానం 'ఘటం'
మట్టి మృతి లేని మృదంగమై

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

నా వేళ్ళకు మాటల్ని బహూకరించినపుడు
మట్టి అమృతంపు ఘటమై
నా వేళ్ళకు జతుల నిచ్చి
ప్రాణంతో జత కట్టినప్పుడు
నన్ను నేను మరచి
నాలో నేను ఒదిగి
విడదీయలేనంత మమేకం అవుతాను
మట్టిగానే జీవిస్తాను
మట్టినే పలికిస్తాను
మరణించినా
మట్టిలోంచే పలుకుతాను
మట్టినే చరిత్రగా
మలచుకుంటాను

రచనా కాలం : 15.05.02

# ఒంటరి అనుభవం

ఏదీ వెంటలేని ఏదో ఒక ఒంటరి అనుభూతి
కలలు, కథలు, కలతలు, కాలం
అన్నీ నీడలా వెన్నంటి నిలిచినా -
వింత వింత స్నేహాలు
రంగు రంగుల ఛానళ్ళు
ఎంత విశాల ప్రపంచాన్ని
వాకిట్లో ఆరబోసినా
అంతరాత్మ ఒంటరిగానే మేల్కొన్నది

అమ్మ గుండెల్లోంచి కురిసిన అనురాగం
ఇల్లాలి కౌగిట్లోంచి విరిసిన అభిమానం
రాసుకున్న రాగాలు
అందుకున్న నీడలు
ఏవి జోకొట్టినా కునుకుపడని ప్రాణం

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

అదో ఒంటరి అనుభవం
అక్షరాల్లో ప్రవహించిన ఆనందం
కాలంలో కదలాడిన దుఃఖం
అన్నీ వింత నాటకంలో పాత్రలే
ఒంటరితనాన్ని మాత్రమే మిగిల్చిన గీతలే

ప్రపంచం పట్టనంత ప్రేమనాలో ఉంది
అయినా అది ఒంటరిగానే ప్రవహిస్తుంది
గతానికీ గమనానికీ మధ్య
సంతోషం పంచుకోవడానికే కాదు
కనీసం కలహించడానికైనా
నా వెంట నిజంగా ఎవరూ లేరు

ప్రయాణంలో తోడున్న వాళ్ళంతా
ఎవరికి వాళ్ళు -
ఎవరి ఆత్మీయత చాటున వాళ్ళు -
ఎవరి అహంభావం గుప్పెట్లో వాళ్ళు -
అంతా ఒంటరి వాళ్ళే.
ఒక్కోసారి సాహచర్యంలో సానుభూతి లభించినా
అనుభవం ఒంటరిది
మిగిలే అనుభూతి ఒంటరిది
అందుకే
నాకు నేను

నాకు తెలియకుండానే నేను

నానుంచి కూడా దూరంగా పారిపోతున్నాను

ఎవ్వరికీ అందనిచోట

సుదూరంగా

అఫ్ కోర్స్ !

ఇవాళ జీవితంలోనే కాదు

రేపు మరణంలో కూడా నేనెంత ఒంటరివాణ్ణి

రచనా కాలం : 24.01.02

# అధ్యయన వేళ దాటితే

యుద్ధాన్ని చుట్టుకున్న భూగోళం
కక్ష్య మారి ఖగోళ విన్యాసాలు చేస్తుంది
ప్రపంచం పద్మవ్యూహంలో చిక్కుకొని
దారి మరచి దాగుడు మూతలాడుతుంది
ఇది అధ్యయన సమయం కాదు
ఆహవంలో దూకి
అమ్మను దక్కించుకోవలసిన సమయం
నిర్వచనాలు చెప్పే సమయం కాదు
నన్ను నేను నిరూపించుకోవలసిన సమయం
అందుకే
ప్రేమను తెలుసుకోవడం కోసం రాలేదు
ప్రేమను గుండెనిండా నింపుకొని వచ్చాను
జీవిత ప్రయోగశాల టెస్ట్‌ట్యూబ్‌లో

కన్నీరు నింపి పరీక్షించడానికి రాలేదు
కళ్ళనిండా దాచుకున్న కన్నీటిని
కలంలోకి
కంఠంలోకి
కాలంలోకి
ప్రవహింపజేయడాని కొచ్చాను
ప్రపంచమే నేనై ప్రజ్వలించడానికొచ్చాను
ప్రపంచమే నేనైనప్పుడు
మార్పూ,
మారణహోమం,
మహాకవి వాక్కులోంచి ఉద్భవించే
మరో ప్రపంచం
అన్నీ నేనే -
చుట్టూ మోహరించే
అనైతిక విన్యాసాల నెదుర్కుంటూ
నా నేలలా
నేనూ యుద్ధంలోనే ఉన్నాను
ఆయుధం అక్షరం కావచ్చు
అనుభవం కావచ్చు
కరవాలం కావచ్చు
కన్నీరు కావచ్చు
పదును కోసం నేనెంత
పాకులాడానన్నదే ప్రశ్న
అడవిలో రాలిన ఆకుల కోసం నేనెంత
ఆ।

---

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

రాలింది అక్కకావచ్చు
అరుణ పతాకం కావచ్చు
నేనెంత రగిలి పోయానన్నదే ప్రశ్న
కూలింది
బనియామ్ బుద్ధ విగ్రహాలు కావచ్చు
బాబ్రీ మసీదు కావచ్చు
నేనేమి కోల్పోయానన్నదే ప్రశ్న

చూడు బ్రదర్
ఇవాళ నేను
మాట చెప్పడానికి లేను
మనుగడ స్తంభిస్తే
మందు పాతరై పేలడానికున్నాను

రచనా కాలం : 10.01.02

# భ్రమణ భ్రమ

ఎంత దూరం జతగా సాగినా
కలవని కాలం అంచులమీద
జీవితాన్ని దోచుకొని దాచుకుని
పారిపోతున్న పెనుభూతంలా
ఎంతవేగం నటిస్తుంది !
దొర్లి దొర్లి బయలుదేరిన చోటికే చేరే భూగోళంలా
ఎంత మందిని మోస్తూ సాగుతున్నా
అదో భ్రమణ భ్రమ !
చేరిన పక్షులన్నీ ఎక్కడి వక్కడే ఎగిరి పోతాయి
ప్రతి పక్షీ తను బయలుదేరిన చోటుకోసమే వెతుకులాడుతుంది
ఒక్క పూటలో ఎన్ని గమ్యాలు
ఎన్ని కొత్తలు, ఎన్ని పరిచయాలు
ఎన్ని ప్రపంచాలు, ఎన్ని దాటిపోయిన జాడలు
ఎన్నెన్నో అందిస్తూ

ఎందరో ఉన్న ఏకాంతంలో
దూసుకొచ్చే భావగీతంలా -

ఉన్న క్షణంలోనే ఎక్కడికక్కడే అధికారం
ఎక్కడికక్కడే సాలెగూడు
పురుగులు గూడు జయించాలనే ప్రయత్నం
తొండలు, బల్లులు, పక్షులు, చీమలు
రాళ్ళు రప్పలు
అద్భుతాలు అబద్ధాలు
అగ్రరాజ్యం వెంట వెళ్ళే దేశాల్లా
అదో ప్రపంచం !
జాతులన్నీ కలసి మెలసి ఉన్నట్లు
జెండాలన్నీ చెట్టపట్టాలేసుకున్నట్లు
అదో కల !
తొలి కోడి కల చెదరగొట్టాక
కాగితం పూలన్నీ రాలిపోయేవే !
బోసిపోయిన భోగీలు
యుద్ధంలో ఓడిపోయిన దేశాల్లా
ఎక్కేవాడికే కాని
దిగేవాడికేమీ కానట్లు
పలక మీద గీతల్లా చెరిగి పోతుంటే-
అంతేగదా !
మనిషి అవసరం తీరాక తెప్పనే కాదు
మనిషినే
దేశాన్నే...
ప్రపంచాన్నే దూరంగా నెట్టేస్తాడు

రచనా కాలం : 17.11.01

# పేగుబంధం

సబర్మతీ ఆశ్రమంలో
మహాత్ముడు మంచి తులసికి బదులు
గంజాయి మొక్క నాటాడేమో !
కడుపు చించుకుంటే
కడుపులు చించిన ఆత్మకథలే !
ఇప్పుడక్కడ
రాట్నం నూలు వడకడం లేదు
పేగుల్ని చుట్టుకుంటుంది
ఇప్పుడక్కడ
రైళ్ళు మనుషుల్ని తీసుకెళ్ళడం లేదు
శవాల్ని మోస్తున్నాయి

అన్నీ ఆకులురాలిన చెట్లే !
నిలువెల్లా గాయపడ్డ కళేబరాలే !

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

కరుడు గట్టి యింకిపోయిన కన్నీటి చెరువులే !
తల్లిదనం ఒయాసిస్సు తెలియని యిసుక ఎడారులే !

చూడు ...
ఆశ్రమాల్లో ముదిరిన కాషాయాస్త్రాలు
ఎగరేసిన శాంతి కపోతాన్ని
ఎంతబాగా గురిపెట్టాయో !
గంతలు కట్టుకున్న గాంధార జీవనంలో
ప్రాణాలు పాచికలు గాకేమౌతాయి
రాక్షస దాహం తీర్చడానికి
నడుం కట్టిన మతం 'మోడీ' కి
మానవత్వం ఎక్కడుంటుంది

పెళ్ళేకాదనుకున్న పెద్దాయనా !
నీకు పేగుబంధం ఎలా తెలుస్తుంది
కడుపు చించుక పుట్టిన బిడ్డలే లేనపుడు
కడుపు చిచ్చు పెట్టేందుకు బాధేముంటుంది

గుండెకోతను పంచుకోవడానికి
ఇవాళ ముందుకొచ్చింది నాయకులు, పాలకులు కాదు
అక్షరాలొచ్చాయి
ఆర్త హృదయాలొచ్చాయి
అవిరాళ్ళే కన్నీటి చుక్కలొచ్చాయి
ఆయుధానికి లేని బలం అక్షరానికుంది
మున్నీటికి అందని లోతు కన్నీటికుంది

ఖబర్ దార్ !

నువ్వు ఓట్లను దండుకోవచ్చు
సీట్లను పంచుకోవచ్చు
పదవులు మార్చు కోవచ్చు
పరువును మాడ్చుకోవచ్చు
కలాన్ని మభ్య పెట్టలేవు
కాలాన్ని జయించలేవు

రచనా కాలం : 14.07.02
ప్రజాసాహితి జన్మదిన ప్రత్యేక సంచిక 2002

# ఒక జ్ఞాపకం కోసం

జ్ఞాపకాన్ని తడివితే
ఎంత హాయిగా ఉంటుంది
ఎంత గాయమైనా నయమౌతుంది
అవి యుగాలు కావచ్చు క్షణాలు కావచ్చు
నిజంగా అనుభవించిన తలపులైతే
ఎంత స్నేహం తొంగి చూస్తుంది
అందుకే విశ్వ విద్యాలయం
నాకో విరిగిన జ్ఞాపక శకలం
అప్పుడప్పుడు ఎడదలో పొంగివచ్చే
అమృతం స్రవించే వ్రణం
తలచుకున్నప్పుడల్లా నేను
వేయిరేకులు విప్పుకుంటూనే ఉంటాను

ఒక అనుభవం నుంచి

అప్పటికి నేనింకా ఏమీ కానప్పుడు
ఏ లతాంతపు వాసనా తెలియనప్పుడు
చినవాల్తేర్ సిటీబస్‌లో
తగిలీ తగలని స్పర్శ
గులాబీ రెక్కలు రాలిపోకుండా
వానిటీబాగ్‌లో దాచుకుంటే
అవి అక్కడే పుష్పించి ఫలించి
రేకులై, లేఖలై
అర్ధరాత్రి సముద్రపు ఈదురుగాలులై
తట్టిలేపిన జాడలై
గీతలు గీతలై కాలంలో
ఎలా కలసి పోయాయో !

షిప్ యార్డ్‌లో శిలలా నిల్చిన సౌందర్యం
జారిజారి గుండెల్లో పడిపోయిన దృశ్యం
పికాసో రంగుల కుంచె కందుతుందా !
బీచ్‌రాళ్ళ మీద ఘనీభవించిన కాలం
తడిగాలి తగిలి ఉలిక్కిపడిన మేఘం
అలల గలగలలతో గొంతు కలిపిన రాగం
వర్డ్స్ వర్త్ ప్రెల్యూడ్‌లో పలుకుతుందా !

లైట్ హౌస్‌లో
దాగుడు మూతలాడిన క్షణాలు
డాల్ఫిన్స్ పర్వతాగ్రాన
సూర్యుడితో ఆడుకున్న రోజులు
రాత్రి సముద్రంలో మినుకు మినుకుమంట

దూరంగా కనిపించే వెల్గు నౌకలు
ఇసుకలో కూరుకుపోతున్న తప్పెట గుళ్ళు
వెన్నెల్లో ఎగిరే చప్పట్ల గిలిగింతలు
కదలికల్లో గుచ్చుకున్న చూపులు
జీడిచెట్టు పొదరిళ్ళలో
అలసిపోయిన ఊసులు
అలలు అలలుగా
ఓహ్ !
ఎన్నెన్ని జ్ఞాపకాల వలయాలు
చుట్టుముట్టి సుగంధం చిందిస్తున్నాయి
కనుకనే విశ్వవిద్యాలయం
గుండెచుట్టూ తిరిగే జ్ఞాపక వలయం
మళ్ళీ వయసు తగ్గి
మళ్ళీ వైజాక్ చేరి
మళ్ళీ .....
మళ్ళీ .....
జ్ఞాపకం జీవితం కన్నా గొప్పది
జీవితం జ్ఞాపకాలతో ఉన్నప్పుడే గొప్పది

రచనా కాలం : 10.02.01

# ప్రతిక్షణం ప్రశ్నైనప్పుడు

ఇవాళ మనిషి అడుగడుగునా
సమాధానం లేని ప్రశ్నలనే ఎదుర్కొంటున్నాడ
పతనోన్ముఖంగా సాగుతున్న మనిషికి
జీవించడమే ప్రశ్నయినప్పుడు
ప్రశ్నకు ప్రశ్నే సమాధానమౌతుంది
ఇవాళ
జాతీయ వైతాళిక గీతాల పడగ నీడలో
జాతి జాతంతా వంచించబడుతుంది.
ప్రజలకు సమాధానం చెప్పవలసినప్పుడల్లా
పాకిస్తాన్‌తో యుద్ధం ఎందుకొస్తుంది !
ఉన్మాదం మనదా ? వాళ్ళదా ?
వంచనతో మంచుకొండమీద
మరణించిన వీరుడి ప్రాణం
వాడు తీసిందా ? మనం తీసిందా ?

ఐరాస రాజ్యాంగ జూదంలో
అమెరికా గాంధారపు టెత్తుల్లో
మనదెప్పుడూ అరణ్య వాసమేనా ?
రోగానికి మందు వేయలేనప్పుడు
స్టెతస్కోప్ చేతిలో ఎందుకు ?
ఎన్‌కౌంటర్లో ఎప్పుడు మరణించినా
సంకెళ్ళకు చిక్కిన జెండాలేనా ?
ఆకలితో అరిచే అరుపులేనా ?
పోలీసు మేకలెన్నాళ్ళు
పులికోరలు తోముతాయి ?
ఆత్మహత్యల నుంచి
మత హత్యల వరకూ
అన్నీ గొంగళి పురుగులకేనా ?
రక్తపు మరకలన్నీ బహుకృత వేషాలకేనా ?

చిట్లిపోయిన వాత్సల్య సంగీతంలో
శ్రుతులు వెర్రితలలు వేస్తున్నాయి
జాతీయ పతాకంలో పచ్చరంగు
కాశ్మీరు ఫాక్షనిష్టుల కుచ్చుటోపీలైతే
దేశంలో మిగిలిన కాషాయం
ధర్మచక్రాన్ని మింగేసింది
తెల్లని స్వతంత్రం తేలుకుట్టి ఏడుస్తుంది

కాటువేయబడ్డ సంస్కృతీ చక్రంలో
ఛానళ్ళు దిగంబర విన్యాసాలు చేస్తున్నాయి
అర్ధరాత్రి కళ్ళలోకి పొడుచుకొచ్చిన

నిషిద్ధ దేహంలో యువత జారిపోతుంది
ఓహో !
సంపూర్ణ నైతిక పతనం తరువాత సరసంలా
గడియారంలోని ప్రతిముల్లూ
జుగుప్సనే కళ్ళముందు చూపుతుంది
అవును !
వర్తమాన కాలరేఖాచిత్రంలో
ప్రశ్నలేని బిందువెక్కడ ?
ఏ గుండెను పగులగొట్టినా
ప్రశ్నకాని స్పందనెక్కడ ?

రచనా కాలం : 14.08.02
నేటినిజం 4.10.02

# దారులు వేరైనా.

అరుగో వాళ్ళు
చేతినిండా శిల్పం నింపుకున్న వాళ్ళు
చైతన్యం అందిన దాకా తపస్సు చేసిన వాళ్ళు
అన్నీ కావాలనుకున్న నేపథ్యంలో
కొందరి అభిమానం కోల్పోయినవాళ్ళు
మండుతూ మండుతూనే
మెప్పులకోసం
మేజువాణీల కోసం
తమపై తామే
యిన్ని చన్నీళ్ళు చల్లుకున్న వాళ్ళు
పంట వెంట పంట పండిస్తూనే
పరిగలేరుకుంటున్న వాళ్ళు
ఉండీ లేని వాళ్ళేనారు

మరి మనకి పనికిరారు

ఆ పక్కనున్న వాళ్ళు

స్పష్టంగా అస్పష్టతని కావిలించుకున్న వాళ్ళు

చెట్టుమీద చిలకల్లా

ఎక్కడ వాల్తారో తెలియని వాళ్ళు

స్వప్నంలో సృష్టించుకున్న సొంత లిపిలో

చేవ్రాలు చేసిన వాళ్ళు

వేదనలో వేకువని చూడలేని వాళ్ళు

ప్రయోగాల పైరవీల్లో

పండిన అనుభూతుల్ని కూడా

పదిమందికీ పంచలేని వాళ్ళు

ఏకాంతంలో తంత్రులై మూర్ఛనలు పోయే వాళ్ళు

ఏనాడైనా కాలంతో కలుస్తారో లేదో !

ఇదిగో వీళ్ళు !

కలంలో మూడో నేత్రపు లావాని పొంగించిన

శివుడి చిటికెన వేలు పట్టి

అడుగులు వేస్తున్న వాళ్ళు

కాలాన్ని గెలిచిన వాళ్ళు

శాసనం లేని శకంలో ప్రవహిస్తున్నవాళ్ళు

మానవ సంబంధాల నెరిగిన వాళ్ళు

రక్తమాంసాలున్న వాళ్ళు

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

రగులుతున్న గుండెకు గుర్తులు
నిరంతర చైతన్య మూర్తులు
అయినా ఈ మధ్య
వాదాల భేదాల్లో చిక్కుకొని
వాని వరుసలు కోల్పోతున్నారు
మబ్బు తెరలు తొలగించిచూడు
నిజంగా ఈ కాలచరిత్రకు సాక్షులు

రచనా కాలం : 17.10.01

(తిలక్ త్రిమూర్తులు చదివి -
తిలక్ జాడకు కృతజ్ఞతలు చెబుతూ -)

---

# కార్నివాల్

తనకు తాను ప్రపంచం ముందు
పరుచుకున్న పడుచు అందం
లక్షల కళ్ళముందు విరబోసుకొని
ఎంతగర్వంతో గంతులేస్తుందో
సొంతం మరణించాక
సొంతం ఏముంటుంది
అంతా  వొలుచుకున్నాక
అసభ్యతేముంటుంది

మనిషి చర్మాన్ని
అందమైన వస్తువుగా గుర్తించినపుడే
మేధస్సుకు పురుగు పట్టింది
సామ్రాజ్య వాద సంస్కృతి భట్వాడా చేసిన
ఆంత్రాక్స్ వైరల్ వ్యాపార కవర్లలో

అందం ఆరబోసుకోవడంలో ఎంత పోటీ !
కాస్మొటిక్స్ మార్కెట్ యుటిలిటీ గ్రాఫ్‌లో
అసహ్యామైన మురికి తీరాలను సైతం
అందంగా దర్శిస్తున్న శాపగ్రస్త ప్రపంచం
చాటుగా వొలుచుకోవడంలో
చరిత్రలు మారతాయన్న భయంకోసం
అన్నీ తీసి కట్టెల్లో పడుకోబెట్టిన
మరణానంతర అనుభూతికోసం
అదిగో
అదో క్షుద్ర స్వప్నం
అదో సామూహిక అనాగరికచర్య

తల్లి గర్భంలో తనివి తీరని
దిగంబర దాహం కోసం
నాట్యాన్ని కూడా
బూతుగా చెయ్యవచ్చనే
నవీన సిద్ధాంతంకోసం
అదొక రాతిగీతల పాట
అదొక కలసికట్టు కామ కళావిన్యాసం

రచనా కాలం : 15.01.01
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక శాఖ
దక్షిణ ప్రాంత సాంస్కృతిక కేంద్రం
సంయుక్తంగా నిర్వహించిన కవిసమ్మేళనంలో
చదివిన కవిత

# నవ్వులు పూసే కాలం కోసం

గల గలా ప్రవహించే గోదారి అలల్లా
బిగించిన పిడికిట్లోంచి
ప్రెల్లుబికే పాటల్లా
మగత నిద్రలో పూచిన
వెలుతురు కలల్లా
దూరమైన తీరాలను
జరిపి జరిపి అందిస్తున్న జ్ఞాపకాల్లా
అర్ధరాత్రి దుఃఖాన్ని కప్పుకుంటూ
రువ్వుకున్న ఆ నవ్వులు
బూట్ల అడుగుల
కరకు చప్పుళ్ళతో కలసి పోయాయి
మళ్ళీ ఈ రాత్రి ఎన్నాళ్ళకో !
జైలుగోడలు బద్దలైపోయినప్పుడో
ఎన్‌కౌంటర్ల బూటకాలకు తుపాకులు
ఎదురు తిరిగినప్పుడో -

రచనా కాలం : 10.01.01

# అన్నీ నా నుంచే

రంగులన్నీ
నాకు తెలిసినవే
అవి నా కళ్ళనుంచే గదా పుట్టాయి
రాగాలన్నీ
నేను పాడినవే
అవి నా సాధననుంచే గదా పుట్టాయి
వినోదమంతా
నేను చేసిందే
అది నా నవ్వునుంచే గదా పుట్టింది
విప్లవాలన్నీ
నేను నడిపినవే
నా పిడికిలి బిగుసుకుంటేనే గదా !
నా అడుగులు ముందుకేస్తేనే గదా !
నేను మనిషినై పుట్టినప్పుడే గదా !

రచనా కాలం : 05.05.00

# ఒక స్నేహస్మృతి కోసం

లోహియా !

ఈనాటి లోకాన్ని ఒక్కసారి చూస్తావా

మధులిమాయె !

ఈ వింత ఆ రోజుల్లో ఎపుడైనా విన్నావా

అనంత మూర్తీ !

ఆ రాలిపోయిన జాబిల్లి కోసం

మరో నవల రాయకూడదా

అది స్వర్గమో  నరకమో

నల్లని మేఘమో

రాక్షస మేధమో

లీలగా కనిపిస్తున్న

అందమైన ఆమెను చూశారా ?

బాధ పడుతూ

సిగ్గు పడుతూ

ఏవగించుకుంటూ
అసహ్యంగా చూస్తూ
ప్రేమిస్తూ

గీతలా మిగిలిపోయిన
ఆమెను చూశారా?
ఫిడేలు రాగాల మాధుర్యంనుంచి
ప్రకృతి గానంలో కలసిపోయినందుకు కాదు
అందించిన 'సంస్కారా'న్ని ప్రపంచం
అందుకోలేనందుకూ కాదు
కోణార్క్ రెక్కలు విరిచి
కార్నటన్ హౌస్‌లో బంధించినందుకూ కాదు
కలలు కన్న ఆశలన్నీ
కూలిపోయినందుకూ కాదు
జైలుగోడలమధ్య
దిగంబర దృశ్యంగా మారినందుకూ కాదు
అత్యవసర నెత్తురు మరకై
అంతరించినందుకూ కాదు

సోషలిస్ట్ స్నేహ హస్తం కూడ
చేదెక్కి పుచ్చిపోయినందుకు -
తాను మనిషనుకున్న వాడు
పశునై పడుపు వృత్తి చేస్తున్నందుకు -
పదవి కోసం
పరువు విడిచిన పర్వంలో

రక్షణ శాఖకు దిక్కైన
రాక్షస మృగంలా -
పళ్ళూడిన ప్రభుత్వాన్ని చుట్టుకుని
ఎంతకూవదలని నహుష సర్పంలా

చిరిగిన విస్తట్లో
చిల్లులు చూపించిన వాణ్ణే
దోషిగా నిలబెట్టినందుకు -
దేశాన్ని కొరుక్కుతింటున్న
చెదలు పురుగులకు
మందుకొటిన వాడిదే
మహాపరాధంగా నిర్ధారించినందుకు

ఏమిచెప్పి పదవిలో కొచ్చినా
పకీర్లందరి ప్రాణాలూ
ఒక్కచిలుకలోనే ఉన్నందుకు -

రచనా కాలం : 25.06.02

# రూపాయిలో టైగర్

అన్నం ముద్దను కాటు వేసి
కూటి గింజల్ని చాటుచేసి
అన్నపూర్ణలాంటి
అమ్మ ఒంటి మీద నుంచి
రూపాయలు రాల్చుకోవడం
క్షమించరాని మోసమే కావచ్చు !
ఈ మోసం చేసిందెవరు ?

పరచుకున్న పచ్చదనాన్ని చీల్చి
నేల తల్లిని నిలువునా దోచి
పొడుచుకొచ్చిన గొట్టాలతో
పొగబెట్టి జో కొట్టడం
భరించలేని దోషం కావచ్చు !

ఈ దోషానికి కారణం ఎవరు?

చిక్కిన చోటల్లా తూట్లు పొడిచి
రాబందులు రక్తాన్ని పీల్చినట్లు పీల్చి
భూమి తల్లి కన్నీళ్ళకు కూడా
చుక్క మిగల్చని మానవ దాహార్తి
సహించలేని పాపం కావచ్చు !
ఈ పాపానికి కారణం ఎవరు ?

ఆప్యాయంగా అమృతం అందిస్తున్న
అమ్మ గుండెల మీద గుంటలు తవ్వి
నీలి విప్లవం పేరుతో
నిలువెల్లా సాగరంగా మార్చిన
ఆక్వా శ్వేత వ్యామోహం
సైరించలేని నేరం కావచ్చు !
ఈ నేరానికి కారణం ఎవరు ?

చూడు సోదరా !
ఐ యమ్ ఎఫ్ కుతా కట్టుపెట్టిన
నీ తలకు
అంతర్జాతీయ మార్కెట్‌లో
విలువ ఎంత ?
అప్పుల ఊబిలో కూరుకుపోయిన
నీ దేశానికి

అగ్ర రాజ్యాల అణు జూదంలో
స్థానం ఎక్కడ ?
పిచ్చివాడా !
ప్రభుత్వం తగిలించిన
ప్రపంచీకరణ కళ్ళజోడులోంచి చూసే నీకు
రొయ్యలు టైగర్లుగానే కనిపిస్తాయి
మోసంలో రూపాయల్నే మొలిపిస్తాయి
రోషంలేని వింత జీవితాన్నే వడ్డిస్తాయి.

రచనా కాలం 14.08.02

# శృత సౌందర్యం

వినడానికి నీలో చోటుంచుకో
ఎదను పుష్పక విమానం చేసుకో
కిరణాన్ని స్వీకరించి
రంగుల్ని వెదజల్లే
ఆకు నుంచిరాలే తొలిసంధ్య మంచు ప్రింజంలా
మాటకు చోటిస్తే
ప్రపంచానికి చోటిచ్చినట్లే
మాటకు చోటిస్తే
మనిషికి చోటిచ్చినట్లే
మమకారానికి చోటిచ్చినట్లే

వినడం చిన్న విషయం కాదు
నీవు నీకై పేర్చుకున్న ఉక్కు తెరల్ని
ఛేదించుకోవడం మాటకాదు.

---

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

ఎన్ని అవరోధాలు చెవులు మూసేస్తాయి.
పిరికితనం - బలహీనత
అజ్ఞానం - అహంభావం
అవసరం - అభిమానం
సత్యాన్ని దాచడానికి
సవాలక్ష బంధనాలు
అందమైన చెప్పడం
తీయనైన చెప్పడం
అగ్రస్థమైన చెప్పడం
చీల్చి
స్వీకరించడం నిజంగా ఒక తపస్సు
ఒక ఆరాధన
చూపులోను
జీవించడంలోను
పెద్దవాడైనంత సులభంకాదు
పసివాడు కావడం
భావ విచక్షణా లోకంలో
ధనికుడైనంత సులభం కాదు
పేదవాడు కావడం
విన్నవాడు విజ్ఞాని కావడం గొప్ప కాదు
వినడమే గొప్ప

రచనా కాలం 01.09.02

# రెటీనా

కళ్ళు రంగులతో నిండితే
పెదవులు సంగీతం పలుకుతాయి
ఊహాలు మేఘాల్లో తేలుతాయి
కుంచెలు చేతుల్లో మొలకెత్తి
ఆకాశపు కాన్వాస్‌ను అందుకుంటాయి.
అప్పుడు నేనొక

చూపుల్లోనే కలిసి పోతాను.

రచనా కాలం 10.09.02

# గదిలో ప్రపంచం

ఆ గది నాకు
ఓ పవిత్ర దేవాలయం
సహస్రాక్షర సమారాధనం కోసం
ఎదురుచూస్తున్న వందమంది
నా దేవుళ్ళు !

ఆ గది నాకు
ఓ విచిత్ర మంత్రాలయం
అక్కడ నేను అరచేతిలో
సర్వ లోకాలు చూపగల
మాంత్రికుణ్ణి !

ఆ గది నాకు
జన్మనిచ్చిన పురిటి గది

---

ఒక అనుభవం నుంచి

అక్కడ నేను పసివాణ్ణి
ప్రతిజ్ఞా బద్ధుడైన భీష్ముణ్ణి !

ఆ గది నాకు
ఓ గౌరవ గురుపీఠం
అక్కడ నేనే సోక్రటీస్‌ని
నాలుగు దశాబ్దాలు వెనక్కి నడిచి
నన్ను నేను చూసుకునే
అంతఃచక్షువుని !

ఆ గది నాకు
ఎన్నటికీ దారి తెలియని పద్మవ్యూహం
వందల కళ్ళ వాడి బాణాలకు
మాటల సమ్మోహనాస్త్రాలే
ప్రత్యాయుధాలుగా ధరించిన

ఆ గది నాకు
ఓ విశ్వవిపంచి
నేను పలికించే నాదంలో
నేను సృష్టించే నడకల్లో
ఎందరు బుద్ధులు
ఎందరు శుద్ధులు

ఆ గది నాకు
ఓ వెలుగుతున్న నక్షత్రం

గ్రహంలా గదిచుట్టూ తిరుగుతాను
గదిలోనే అలారమై మోగుతాను

ఆ గది నాకు
అమ్మ ఒడి
నాకు నా బిడ్డలకు
ఇంత అన్నం పెట్టే
నారుమడి !

(Best Lecturer Award పుచ్చుకున్నప్పుడు)

---

ఒక అనుభవం నుంచి

# రంగుల కల

కళ్ళకు ప్రకృతి ఇచ్చిన వరం
ఇంద్రధనస్సు
కళ్ళుచేసే నిరంతర తపస్సుకు
ప్రతిఫలం ఇంద్రధనస్సు
సన్నజల్లుల గిలిగింతల్లో
పేటవాలు కిరణాల వెచ్చదనంలో
మబ్బులు
తెల్లగా నల్లగా
కలుస్తూ కలబడుతూ
తీరు తీరు అలల్లా
నుదుటి మీద అలకల్లా
ఆకాశం ఆటస్థలంలో
చూపులు చేసుకున్న వేడుక

ఇంద్రధనస్సు
ఏడు రంగుల్లో
చిన్నప్పుడు నానమ్మ చెప్పిన
ఏడేడు లోకాల గాథలు
పెద్దయ్యాక కన్నీళ్ళు కప్పిన
కంచికి చేరని కథలు

ఏడు రంగులూ కలబోసిన
తెల్లని కిరణంలో
ఎన్ని కలలు
ఎన్ని గలగలలు
సాగిపోయే చరిత్రలా
ఎక్కుపెట్టిన బాణంలా
కన్ను చూడగలిగినంతగా
కాలం కనిపించినంతగా
భవిష్యత్తులోకి భూగోళం
దూసుకు పోగలిగినంతగా
ఎంతో వింతగా

అయ్యో !
అరక్షణంలోనే
ఏ గోళానికి ప్రయాణించిందో
ఏ లోకంలో విహరించడానికి వెళ్ళిందో
జ్ఞాపకం కూడా
దాచుకో లేనంత చిత్రం
రెప్పలు వాలిన క్షణాల్లో
కళ్ళు ఎన్ని దృశ్యాల్ని పోగొట్టుకున్నాయో !

రచనా కాలం - 14.08.02

# రూపం మార్చుకున్న అమ్మ

ఆమె
భవిష్యత్తుని ఆక్రమించిన శూన్యంలో
గాలికి కొట్టుకుంటున్న
దీపాని కింత ఆసరా !
బతుకు చీకటి గుయ్యారంలో
నవ్వుతున్న
నైటింగేల్ ఆఫ్ ది యూనివర్స్

వోడుస్తున్న చీము రక్తాన్ని
దోసిలిపట్టే ఓదార్పు
మహంకాళి శూలపు కొనమీద
మమకారం కుమ్మరించే
మదర్ ఆఫ్ ది యర్త్

వైకల్యం నల్ల మచ్చనే

వరంగా మలుచుకు నిలిచిన
వండర్ లేడీ ఆఫ్ ది వరల్డ్
హెలెన్ కెల్లర్,

కాలుడితో కలబడి
కాలాన్ని గెలిచి
కష్టానికి తోడుగా నిలిచే మేడమ్ కామా,
మురికిలో మూలుగుల్లో
మూలాల్లో ముదనష్టంలో
ముసురుకున్న బాధల్లో
తోడు నిలిచే తొలకరి వాన
బాధల యజ్ఞవేదిక ముందు
నైవేద్యంగా నిలిచిన సిస్టర్ నివేదిత.

చూపులను చూరకత్తులను
చూరు బట్టుక వేళ్ళాడే
సూదంటు రాళ్ళను
చిరునవ్వుతో జయించే 'రాఖీ'

తాను కరిగి పోతూ
ప్రపంచానికి వెలుగుపంచే
ప్రభువు ముందు కొవ్వొత్తి

మనకోసం మరణించే
నరకంలో అమ్మ
నా దృష్టిలో ఆమే
బంగారు బొమ్మ !

రచనా కాలం 04.12.01

## 'ఒక తంత్రిలా'

"నిద్రలో మరణాన్ని, సూర్యాస్తమయంలో
విషాద సువర్ణాన్ని చూడటం - అదీ కవిత్వమంటే
అది శాశ్వతం - కాని నిరుపేద కవిత్వం
తిరిగొస్తుంది ఉషోదయంలా, సూర్యాస్తమయంలా -

కొన్ని సమయాల్లో సాయంత్రిల్లో ఓ ముఖం
అద్దం లోతుల్లోంచి మనకేసి చూస్తుంది

కళ అంటే ఆ అద్దంలా ఉండాలి
మన ముఖాన్ని మనకే బహిర్గతం చేయాలి
మహాద్భుతాలతో తనివి తీరిన యులిసిస్
పచ్చదనాల సాధారణ ఇథా కాని చూసి
ప్రేమభాష్పాలు రాల్చేవంటారు
కళ అంటే అనంత హరితాల ఇథాకా,
అద్భుతాలు కాదు."

స్పానిష్ :- జార్జ్ లూయిస్ బోర్హెస్
ఆంగ్లం :- మెర్విన్
తెలుగు :- కె. సదాశివరావు

తొమ్మిది మాసాలుపైగా డా॥ భూసురపల్లి నాతోనే వున్నాడు. అతనున్నాడంటే అతని కవిత్వం ఉందన్నమాట. కవిత్వమే కవి గదా !

చాలాసార్లు అతనిలోకి ప్రవేశించాను. ఓ చిన్న నల్లని పిట్ట నదీ జలాల్లో మునిగి పైకితేలినట్టు తేలాను. మళ్ళా మునిగాను, మళ్ళా తేలాను.

---

ఒక అనుభవం నుంచి

ఈ మునగటం, తేలటం ఒక్క భూసురపల్లి లోనేనా? కానే కాదు అతనితో పాటు నాలో నేను మునుగుతున్నాను తేలుతున్నాను. ఇదొక క్రీడలా మారింది,

లోలోతుల కెళ్ళి నపుడు క్రీడకళ అవుతుందేమో ! మగ్నం కావడం గురించీ, మునిగి తేలటం గురించీ పదే పదే మననం చేసుకుంటూ వస్తువుల, మనుషుల లోతుల్లో, కెళ్ళటం గురించి అధ్యయనం చేస్తున్న తరుణంలోనే, ఒక భూసురపల్లో, ఒక బోర్హెస్సో, ఒక సైఫర్తో ఎదురవుతారు. అతడెవరయినా, నాలాగా, నా దగ్గరకి వచ్చేస్తాడు.

దోసిలినిండా మంచినీళ్ళు తెచ్చి, నా గొంతులో యిన్నిపోసి, కాసిని ముఖం మీద చిలకరించి నే తెప్పరిల్లాక తప్పకుంటారు.

ఒక హిబ్రూకవి NATAN ZACH ఏవన్నాడు -

'This is a song about people
About what they think, what they want
And what they think they want'

విష్ణుఖరే అనే హిందీ కవి, ఉద్యోగం యాచిస్తూ తనదగ్గరకొచ్చిన అమ్మాయి గురించి రాస్తూ -

"ప్రతి సాయంత్రం
నా అపరిచిత కూతురు తిరిగి వస్తుంది
కొత్తగా దయగల వాళ్ళను
కూతురుగా భావించి ఉద్యోగ మివ్వమని
వేడుకుంటూ, వ్యాకులపడుతూ, వేదనపడుతూ
రేపొద్దున
వేలాది మంది కూతుళ్ళు బయటికి వస్తారు.

---

వేధించబడే, అవమానించబడే, భయపెట్టబడే
ఆశతో ఒక తండ్రిని అన్వేషిస్తూ"

"కవిత్వం మొదట్నుంచీ మనతోనే వుంది
ప్రేమలాగా, ఆకలిలాగా,
వ్యాధిలాగా, యుద్ధంలాగా
కవిత్వం మొదట్నుంచీ మనతోనే వుంది
బహుశా మనలోనే వుంది"

జెన్‌కవి సైఫర్ట్

"అదో భ్రమణ భ్రమ
చేరిన పక్షులన్నీ ఎక్కడి వక్కడే ఎగిరిపోతాయి
ప్రతి పక్షి తను బయలుదేరిన
చోటు కోసమే వెదుకులాడుతుంది"

డా॥ భూసురపల్లి

"ప్రపంచం పట్టనంత ప్రేమ నాలోవుంది
అయినా అది ఒంటరిగానే ప్రవహిస్తూంది
కనీసం కలహించడానికైనా
నా వెంట నిజంగా ఎవరూలేరు -
ఇవాళ జీవితంలోనేకాదు
రేపు మరణంలోనూ నేనెంత ఒంటరిని"

డా॥ భూసురపల్లి

భూసురపల్లి ఏం మాట్లాడుతున్నాడు ?
నా ముఖాన్ని నాకే బహిర్గతం చేస్తున్నాడా !
ఒకానొక విచిత్ర వినూత్న సంక్లిష్ట

అసంబద్ధ చారిత్రక సందర్భంలో
'తననే మనల్ని' గా చేస్తున్నాడా !
ఎంత విషాదం-'మరణంలో ఒంటరితనం'-
జీవితంలో ఒంటరితనం - ఏం నెడితే మనిషి విషాదాంత స్థితికి
చేరటం-

"మెలకువ కలలు నిద్ర కావని గ్రహించడం
మరో కల, మరో మరణం - బోర్హెస్

ఎవరు ఎట్లా ఎక్కడ తాకుతారో చెప్పలేం - వీళ్ళందరిలోనూ కించిత్ నేనులేనా ?

"ఇది అధ్యయన సమయం కాదు
ఆహవంలోకి దూకి
అమ్మను దక్కించుకోవలసిన సమయం -
నిర్వచనాలు చెప్పే సమయం కాదు
నన్ను నేను నిరూపించుకోవలసిన సమయం"

బాబ్రీమసీదు, బనియామ్ బుద్ధ విగ్రహం,...గుజరాత్, ఇజ్రాయిల్, పాలస్తీనా, హైద్రాబాద్ పాతబస్తీ, శ్రీకాకుళం, కరీంనగర్, ఒంగోలు, గుళ్ళకమ్మా-

దేశం, ప్రాంతం, సమయం వేరేమో, కాని మనిషి ఒక్కడే - మనిషి విరిగి పోవటమూ ఒక్కటే -

ముక్కలైన లెనిన్ విగ్రహం కానీ, సద్దాం బొమ్మకానీ -
అక్కడ మన శిథిలాలు మనకలల స్మశానాల్లు
మనముందు పరచుకొని అనంతంగా -
ఆ గాజు పెంకుల జ్ఞాపకాల మీద నడుచుకొంటూ -

"చినవాల్తేర్ సిటీ బస్‌లో
తగిలీ తగలని స్పర్శ

తట్టి లేపిన జాడలై
గీతలు గీతలై కాలంలో
ఎలాకలసి పోయాయో -
ఇసుకలో కూరుకుపోతున్న తప్పెట గుళ్ళు -
మళ్ళీ వయసు తగ్గి

జ్ఞాపకం జీవితం కన్నా గొప్పది
జీవితం జ్ఞాపకాలతో ఉన్నప్పుడే గొప్పది."

"There was a hope, which was expressed in several different and conflicting versions, that when we arrived here, as soon as feet touched this good Earth, Our hearts would be changed - A Recovery"

Amos 02 అన్నప్పుడూ -

"మట్టినాకు అమ్మేకాదు, అమృతంకూడా
మట్టినాకు అన్నం ముద్దే కాదు
ఆత్మ జిజ్ఞాసకూడా
మట్టిలోంచి పుట్టిన నావేళ్ళు
మట్టి మీదే పలుకుతున్నాయి
మట్టిని పలికిస్తున్నాయి.

---

ఒక అనుభవం నుంచి

నాది ఋణానుబంధమేకాదు

నాదానుబంధం

అమృతానంద సంధానం

"నా తపస్సులో నేను పగిలి మృత్తికనై

నా స్పర్శలో నేను రగిలి చైతన్య చేతననై

నన్నునేను పలికించుకున్న

వర్తమాన 'ఘటం'

మట్టి మృతిలేని మృదంగమై

నా వేళ్ళకు మాటల్ని బహూకరించినపుడు"

Amos 02 అన్నట్లు -

A Recovery - Perhaps great Recovery-do we need a great Resurgence - Recovery?"

నాదానుబంధం అన్నాడు గదా - ఈ నాలుగులైన్ల ఆత్మలో మనం లీనం కావడానికి డా॥ భూసురపల్లి గొప్ప డోలు, ఘట, మృదంగ విద్వాంసుడని తెలియనక్కర లేదు. జీవితాన్నీ లోకాన్నీ అధ్యయనం చేస్తూ, పిల్లల్ని అధ్యయనంలో భాగస్వాముల్ని చేసే వృత్తిలో వున్నాడనీ తెలియనక్కరలేదు. కానీ,

ఒక వర్తమాన విషాదం గురించి తెలుసుకోవాలి;

మాటల సందర్భంలో అతని ఈ వాక్యాల నైపుణ్యం తెలిసి అమాయకంగా అడిగా,

"మీరు వాయించడం ఎందుకు మానారు ?

గొప్ప ఓదార్పు కదా సంగీతం, సాహిత్యం !

ఉన్నదాన్ని మీరెందుకు ..."

వాక్యం పూర్తిగాక ముందే "అద్దెకుండే ఇళ్ళు -
ఊరుగానీ, నగరం గానీ, చుట్టు పక్కల వాళ్ళకి disturbance - నిద్రాభంగం" గొంతులోకి పొంగిన ఆర్తి - అంతే, బహుశా ఈ ఆధునిక విషాదానికి మూలాలు లేవా - పరాయీకరణ వలయాల్లో ఎటో కొట్టుకుపోతూ - ఎంత అద్భుతంగా అన్నాడు -

"నా తపస్సులో నేను పగిలి మృత్తికనై
నా వేళ్ళకు మాటల్ని బహూకరించినపుడు-"

- డా॥ భూసురపల్లి

"ఏది నిశ్శబ్దపు పెదాల్ని
కొద్దిగా వణికేట్టు చేస్తుందో
అదే సూర్యాస్తమయ సమయంలో
బంగారు రంగుపొలాల్లో
విహారం చేస్తున్న ప్రేమికుల్ని
ముద్దాడుకునేట్టు చేస్తుంది.

- సైఫర్ట్

ఒక మరణమో, అనేక మరణాల్తోనో ముగిసే విషాదాంత నాటకం కాదిది. ఏ మరణమూలేకనే నిత్యం మరణానుభవాన్ని పొందే వర్తమానం విషాదం మధ్య

కవిత్వం ఎలా ఉంటుంది?

తల్లిదండ్రులు వద్దనుకుంటే చచ్చిన ఆడపిల్ల ఆత్మలా -

సమూహంలో ఒంటరితనం, సహచరివక్కలో ఒంటరితనం, సాగుతున్న యాత్రలో ఒంటరితనం ఆఖరికి మరణంలో కూడా ఒంటరి తనం-

ఇది ఒక వ్యక్తి ఒంటరితనం కాదు - ఒక జాతి - ఒక దేశం, ఒక 'విశ్వనరుడు' పొందుతున్న ఒంటరితనం -

సమాధిలా లోన దాచుకున్న 'ఒంటరితనం మృత్యువు'

ఒక కొత్త సందర్భం -

ప్రతిదీ సరుకే - ప్రతిదీ వ్యాపారమే - మనిషి ఒక వస్తువు - లాభనష్టాలు బేరీజు వేసుకోడానికి పనికొచ్చే ఒక పనిముట్టు - దేశ కాల రహితంగా మనిషి ఒక మార్కెట్టు - స్వేచ్ఛా విపణి ;

అదుగో అక్కడ్నుంచి మొదలయ్యింది, తనుతాను కాకుండా పోవడం - తను మరణించటం -

ఎక్కడా ఆనందంలేని, తృప్తిలేని, ముగింపులేని ప్రపంచ విషాదాంత నాటకంలో

"అన్నీ ఆకులు రాలిన చెట్లే !

నిలువెల్లా గాయపడ్డ కళేబరాలే !

ఇంకిపోయిన కన్నీటి చెరువులే !

తల్లిదనం ఒయాసిస్సు తెలియని

ఇసుక ఎడారులే !

చూడు -

ఎగరేసిన శాంతి కపోతాన్ని

ఎంతబాగా గులిపెట్టాయో !

"కాటువేయబడ్డ సంస్కృతి చక్రంలో

భోనల్ల దిగంబర విన్యాసాలు

అర్ధరాత్రి కళ్ళల్లోకి పొడుకొచ్చిన

నిషిద్ధ దేశంలో యువత జారిపోతుంది.

---

డాక్టర్ భూసురపల్లి వేంకటేశ్వర్లు

ప్రతిమనిషి
తనతోతాను, వ్యాపారం చేస్తున్నాడు
ప్రతివాడూ ఎదుటి వాడికి
అపరిచితుడు గానే నడుస్తున్నాడు

చదువులు సంతలో బేరమాడుతున్నాయి
వృత్తులు గోడకు వేళ్ళాడు తున్నాయి"

నగరం కంటే
నాకేం తక్కువనుకునే
నా పల్లెను చూడలేక
నాకునేనే తలవంచుకుని
నాకునేనే కుంచించుకుని"

ఈ స్థితికి కారణాన్ని సరిగ్గానే పట్టుకున్నాడు

"వైజ్ఞానిక కలప పురుగు
వర్ధన్ని వదలని అగ్రభక్షకుడు
కాలం వాడిష్టం మీదే కదలాలి
గ్లోబు వాడిష్టంమీదే తిరగాలి
ప్రపంచ మేదస్సును కాజేశాడు
తరతరాల సంస్కృతిని కాటేశాడు"

గత పదేళ్ళుగా గ్రామాలన్నీ చిన్న చిన్న నగరాలుగా పరివర్తనచెందే క్రమం ఒకటి మొదలయింది. ఇప్పుడు గ్రామాల్లో టీ దొరక్కపోవచ్చు కాని కోకాకోలా పెప్సీలు దొరుకుతాయి -

అభివృద్ధి ఏ దిశగా పోతుంది ! అభివృద్ధి ఎవరికోసం? అభివృద్ధి నిజంగా ప్రజలకు సంబంధించిన అభివృద్ధేనా ?

కానేకాదు. వాళ్ళనుంచి వాళ్ళని విడదీసి, వాళ్ళశ్రమకు వాళ్ళని అపరిచితుణ్ణి చేసే వ్యక్తిత్వ విధ్వంసంలో భాగమే యిదంతా -

అపారమైన మార్కెట్ అవకాశాలున్న భారతదేశం అమెరికాకి వలసదేశంగా ఎలా తయారయ్యింది. భారతదేశ ప్రభుత్వాలు అమెరికాకి ఏజెంట్లుగా తయారయ్యాయి కాబట్టి.

కుల వృత్తులు పోవటం దగ్గరనుంచి, పల్లెలు పట్టణాలవటం దగ్గరనుంచి, చదువుల్లోనూ, మానవ సంబంధాల్లోనూ ఒక కనపడని హింస చోటుచేసుకొని మానవుల్ని అమానవీయులుగా తయారు చేసే కుట్ర. దేన్నీ ఆనందించలేని ఒక దయనీయ మానసిక స్థితి.

'వెలసిన పూసలకోటు' గానీ 'బతుకుపెనం మీద' గానీ 'చిత్తుకాయితం' గానీ ఆ దిశ నుంచి కవిత్వీకరించిన వస్తువులే.

మారిన మారుతున్న సన్నివేశంలో మానవుడు యిరుక్కుని, అంతర్గత హింసకు బలవుతూ ఒక అవ్యక్తక్రూర సందిగ్ధస్థితికి నెట్టబడుతున్నాడు. మన కంటికి కనిపించే అనేక అంతరాలు, పొరలు తొలగించి చూస్తే అసలు విషయం బోధ పడుతుంది.

డా॥ భూసురపల్లి సరైన మార్గానే వున్నాడు. ఒకస్థితి, దానికి కారణం అన్వేషిస్తున్నాడు. మీరనే రాజకీయ కవిత్వమంటే యిదేనా? ప్రత్యక్ష పరోక్ష ప్రభావాలు ఆధునిక మానవ జీవితాన్ని ఎలా విధ్వంసం చేస్తున్నాయో అవసరమైతే సూటిగానే, లేకుంటే ధ్వనిపూర్వకంగా, వ్యంగ్యంగా కవిత్వంలో ఆవిష్కరిస్తున్నాడు.

---

నాకు తెలిసి డా॥ భూసురపల్లి తెస్తున్న మొదటి కవితా సంపుటి యిది. యింతకు ముందు తెచ్చాడేమో నేను చూళ్లేదు.

మొదటి సంపుటి అయితే మొదటి సంపుటిలో ఉండే పురిటి నొప్పులు గానీ, మొరటుదనం గానీ యిందులోలేవు. అనేక పార్శ్వాలున్న వ్యక్తిగా సామాజికుడుగా వేదన అనుభవిస్తున్నాడు. వేదనా మయమయిన ఒక సామాజిక సందర్భం ఎలాకవిత్వ మవుతుందో తనకి తెలుసు.

"అన్నం ముద్దను కాటువేసి
కూటిగింజల్ని చోటుచేసి
అన్నపూర్ణలాంటి
అమ్మ ఒంటి మీదనుంచి

రూపాయలు రాల్చుకోవటం
క్షమించరాని మోసమే కావచ్చు!
ఈ మోసం చేసిందెవరు?"

పంటపొలాలు రొయ్యల చెరవులుగా మారుతున్న దృశ్యంలోంచి-

"చూడు సోదరా!
ఐ.యమ్.ఎఫ్.కు తాకట్టుపెట్టిన
నేతలకు

విలువ ఎంత?
అప్పుల ఊబిలో కూరుకుపోయిన
నీ దేశానికి
అగ్రరాజ్యాల అఖుజాదంలో
స్థానం ఎక్కడ?
ప్రభుత్వం తగిలించిన
ప్రపంచీకరణ కళ్లజోడులోంచి

చూసే నీకు
రొయ్యలు టైగర్లుగానే కనిస్తాయి."

అనీ అనగలడు.

ఒక కళలో నిష్ణాతుడయిన ఒక వ్యక్తికి మరొక కళలో ప్రవేశం, పరిపక్వ మవడం పెద్ద కష్టమేమీకాదు. పైగా సులువు. అయితే డా॥ భూసురపల్లికి కవిత్వం ప్రాథమిక చర్య కావాలి. అదోక జీవన విధానం కావాలి. కవిత్వం జీవన విధాన మవటం అంటే ఏమిటో సాధనచేసే వ్యక్తికి బాగా అనుభూతమౌతుంది.

"మనం మనకై పేర్చుకున్న ఉక్కు తెరల్ని" ఛేదించుకోవటం అసాధ్యం కాదు. కాకుంటే గట్టి నిర్ణయం చేసుకోవాలి.

'Suffering' మూలాన్ని పట్టుకున్నాడు. 'స్మృతి'ని కవిత్వ అంతర్భాగంగా స్వీకరించినవాడు.

అంతరించిన దేదయినా, అంతరించి పోతున్నదేదయినా స్మృతే - గతాన్ని వర్తమానాన్ని link చేసుకుని, ఆ సన్నివేశంనుంచి పలకటం కొత్తగాదు. కానీ కొత్త సందర్భంలో పుట్టి కొత్త కొత్త వేదనలకూ అభద్రతలకు గురవుతున్న ఒక తరంనుంచి వస్తున్న కవిత్వాన్ని పరిశీలించాలి. కొత్త జీవన సన్నివేశ వ్యక్తీకరణకి కొత్తరూపమూ కావాలి. అంతర్గత వస్తు విస్తృతీ కావాలి. ఒక వస్తువున అనేక వస్తువుల్ని యిమడ్చటం.' ఒక Period ని కవిత్వీకరించటం, అనేక పొరలున్న జీవిగా కవితని నిర్మించటం జరుగుతుంది. శ్రద్ధగా సూక్ష్మంగా పరిశీలించాలి.

చివరిగా భూసురపల్లి నినే కోరేది - తన పూర్తి కాలాన్ని కవిత్వసాధనకి వినియోగించమని - లోలోతుల జేర్చే కవిత్వ విద్యని ఆవాహన చెయ్యమని-

ప్రేమాభిమానాల్తో నే చెప్పే ఈ నాలుగు పిచ్చి ముక్కల కోసం ఎన్నాళ్ళయినా ఎదురుచూసే మిత్రులున్న అదృష్టజీవిని -

డా॥ భూసురపల్లికి అభినందనల్తో

---

# ఎందరో ఆత్మీయులు ...

"మనం కూడా కవిత్వం రాద్దాం!" అన్నంత తేలిగ్గా నేను కవిత్వం రాయలేదు.

రాగాలుకూర్చుకున్నాను. మూలుగుతూ నాలోనేనే పాడుకున్నాను. ఆ పాటల్లో నిక్షిప్తమైన నా స్మృతులనిండా అడుగులచప్పళ్లే - ఎందరుస్నేహితులు - ఎన్ని జీవితాలు - ఎన్ని పలకరింపులు - ఎన్ని పులకరింపులు - ఎద అందరికీ మోకరిల్లుతున్నా - స్థలాభావం వల్ల కొందరి చెబుతున్నా ! -

అక్షరాల అంతర్యాన్ని చూపించి, నా ప్రాణానికి అక్షర సౌగంధాన్ని అద్ది, నన్ను నన్ను చేసిన నా గురుదేవులు డా॥ నాగభైరవ గారికీ, దివినుంచి ఆశీర్వదించే అమ్మ శ్రీమతి నాగరత్నమ్మకీ, ఆత్మీయత పంచిన అక్క శ్రీమతి రాజ్యలక్ష్మి, బావ శ్రీ వెంకయ్య గార్లకూ, తమ్ముడు వీరబాబు, చి॥ పద్మజ, రఘు, తేజ, ఐశ్వర్యరత్నలకూ-

నా పరిశోధన ప్రయాణంలో దారి చూపించిన దంపతులు సహృదయులు తెలుగు విశ్వవిద్యాలయం రిజిస్ట్రార్ ప్రొ॥టి. గౌరీశంకర్, శ్రీమతి సుష్మాశంకర్ (హైదరాబాద్) గార్లకూ -

పుత్ర వాత్సల్యంతో అభిమానించే గురువర్యులు శ్రీ ఈమని దయానంద, కీ॥శే॥ శ్రీమతి అనంతలక్ష్మి దంపతులకూ -

మృదు భాషణంతో ఆత్మీయత వర్షించే పెద్దలు ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు, కళాబంధు శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్య ప్రసారభారతి డైరెక్టర్ డాక్టర్ రేపూరి అనంత పద్మనాభరావు (ఢిల్లీ), ప్రముఖ కవి డా॥ పాపినేని శివశంకర్ గార్లకూ -

ఈ పుస్తక ముద్రణలో సహకరించిన మనిషంతా మనసైన మరో చలం మా శ్రీ గొట్టిపాటి నరసింహస్వామి (సాతులూరు) గారికీ -

నా అభ్యున్నతిని కాంక్షించే నాట్యావధాన బ్రహ్మ డా॥ ధారా రామనాథ శాస్త్రి, మధురకవి మల్లవరపు జాన్, అన్న శ్రీ నల్లూరి వెంకటేశ్వర్లు, డా॥ మండువ నరసింహారావు, యువ చైతన్యవేదిక శ్రీ వెలిది వెంకటేశ్వర్లు, శ్రీ యం.వి.యస్ హరనాధరావు, శ్రీ ఆర్.వి.యస్. భరధ్వాజ, శ్రీ గొల్లపూడి ప్రకాశరావు, డా॥ నాగభైరవ

ఆదినారాయణ (తాడికొండ), శ్రీ షేక్ ఆలీ (కావూరు), డా॥ కన్నెగంటి రాజమల్లాచారి (నడికుడి), శ్రీ కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి (కనిగిరి), శ్రీ మూడమంచు వెంకటేశ్వర్లు (యర్రగొండపాలెం), శ్రీ ముంగర జాషువా (నాగార్జున సాగర్), శ్రీ తెలికపల్లి సుబ్బారావు (అలవలపాడు), శ్రీ ముచ్చు సీతారామయ్య (బరంపురం), శ్రీ రెడ్డిబోయిన సోదరులు (ఉల్చి) గార్లకూ -

ఆత్మీయ స్నేహితురాలు శ్రీమతి టి. అరుణకీ -

నన్ను అన్నగా అభిమానించే వర్ధమాన కవులు డా॥ బీరం సుందరరావు, శ్రీ కె. యస్వీ. ప్రసాద్ గార్లకూ -

అన్ని వేళలా ఆత్మీయతను పంచిన సోదరులు, యువకవులు శ్రీ జవంగుల అర్జున్, శ్రీ గడ్డం వెంకట రంగయ్య, చదరంగ సమాఖ్య శ్రీ పి.వి. కృష్ణ, శ్రీ అయినాల నాగేశ్వరరావు. డా॥ సంతవేలూరి కోటేశ్వరరావు గార్లకూ -

మావూరి పెద్దలు, నా హితైషులు శ్రీ మండవ సుబ్బయ్య, శ్రీ ఈమని చిన సుబ్బారావు, శ్రీ యాసం నారాయణ, శ్రీ మారెళ్ల ధర్మయ్య గార్లకూ -

మా సృజన మిత్రులు, పుష్కరంపాటు మలుపు మలుపులో వెన్ను తట్టిన సౌమనస్కులు అభినవ సూరన శ్రీ గాదేపల్లి సీతారామమూర్తి, శ్రీ నీలంరాజు నరసింహారావు, శ్రీ ఇలపావులూరి సుబ్బారావు, శ్రీ తొట్టెంపూడి రామకోటేశ్వరరావు, శ్రీ కట్టా రామకోటేశ్వరరావు, డా॥ యు. దేవపాలన, విద్వాన్ శ్రీ జ్యోతి చంద్రమౌళి, శ్రీ డి.వి.యం. సత్యనారాయణ, శ్రీ గాదే పల్లి సోమసుందర దివాకరదత్తు, శ్రీ పమిడిపాటి వెంకటరమణ మూర్తి, శ్రీ ఇలపావులూరి మురళీమోహనరావు (హైదరాబాదు), శ్రీ ఆర్వీ రాఘవరావు, శ్రీ ధర్మవరపు శ్రావణ్ కుమార్, శ్రీ పాటిబండ్ల [illegible] శ్రీ సందిరెడ్డి కొండలురావు, శ్రీ గుంటుపల్లి రవికుమార్, శ్రీ రామకూరు వెంకటేశ్వర్లు, శ్రీ బోడెంపూడి శ్రీనివాసరావు, శ్రీ అన్నమనేని వెంకటరావు, శ్రీ వారణాసి రఘురామ శర్మ, శ్రీ మోటుపల్లి రామదాసు, శ్రీ దూపాటి రామాచారి శ్రీ ఇలపావులూరి శేషతల్పశాయి శ్రీ తోట మద్దిలేటి, శ్రీ యరమోతు వీరాస్వామి, శ్రీ యన్.శరత్, శ్రీ ప్రసాద్, శ్రీ గాలి వెంకటేశ్వర్లు, శ్రీ కాకర్ల వెంకటేశ్వర్లు, లోక్‌సత్తా శివరామయ్య, శ్రీ యన్. శంకరరెడ్డి గార్లకూ - ఎన్నో జ్ఞాపకాలను మాత్రమే మిగిల్చిన సృజన మిత్రులు శ్రీ వెలసిరి సుబ్రహ్మణ్యం,శ్రీ యాసారపు శ్రీనివాసరావు, శ్రీ నీలంరాజు రాంబాబు, శ్రీ యల్వీ రంగారావు గార్లకూ -

అన్నివేళలా నా అభ్యున్నతిని కాంక్షించిన అద్దంకి కళాసారథులు శ్రీ పంతంగి ఆంజనేయులు, శ్రీ మట్టుపల్లి ప్రభాకరరావు గార్లకూ- డా॥ చదవలవాడ ఫణీంద్రబాబు, శ్రీ చిట్టాబత్తిని కనకసేనరావు, శ్రీ షేక్ మౌలాలీ గురుస్వామి గార్లకూ-

మిత్రులు శ్రీ మంచికంటి వెంకటేశ్వర రెడ్డి, శ్రీ పొన్నూరి శ్రీనివాసులు, శ్రీ కె. బాలకృష్ణారెడ్డి, శ్రీ చౌడూరి నరసింహారావు, శ్రీ పాలూరి శివప్రసాదు, శ్రీ యస్.ఎ.టి.కె. ఆచార్య, శ్రీ శ్రీరామ కవచం సాగర్, శ్రీ చాట్ల రవీంద్రసాగర్, డా॥ ధేనువకొండ శ్రీరామమూర్తి, శ్రీ మల్లవరపు రాజేశ్వరరావు, శ్రీ నాదెండ్ల జ్వాలా ఉమామహేశ్వరశర్మ గార్లకూ -

ఇంకా కవనవిజయం మిత్రులకు -

కవితలు ప్రచురించిన వివిధ పత్రికల వారికి, ప్రసారభారతి వారికీ -

నా శ్రేయోభిలాషులు యన్.కె.బి.ఆర్. డిగ్రీకళాశాల, నూతన [illegible]

[illegible]

ఈ పుస్తకం అందంగా ముద్రించిన డాన్‌బోస్కో ఫాదర్ జ్ఞాన ప్రకాష్ గారికి, సోదరులు యం. ప్రకాష్, బి. విజయకుమార్, గిరి, వెంకటేశ్వర్లు, కె.[illegible] చారి, యన్.వి. సుబ్బారావు, సోదరి శ్రీమతి ఇన్నాసమ్మ, గార్లకు-

**ముఖ్యంగా నన్ను అవ్యాజమైన ప్రేమతో తన హృదయంలోకి స్వీకరించి** [illegible]

[illegible]

## అందరికీ ధన్యవాదాలు